

# బభ్రువాహన నాటకము



ఇది

బళ్లారిలో వకీలుగానుండిన

కీ. శే. కోలాచలం శ్రీనివాసరావుచే

రచియింపఁ బడినది.

## కె. శత్రుఘ్నరావుచేఁ

బ్రకటింపఁ బడియె.






బళ్ళారి.

శంకర విలాస ముద్రాక్షర శాలయందు

ముద్రింపఁ బడినది.

---

1923.



వెల రు 180

శ్రీ

# విజ్ఞప్తి

సత్యహరిశ్చంద్రీయాది పురాణ నాటకంబులను, విజయనగర నాశనాది సుప్రసిద్ధ చరిత్ర నాటకంబులను, బలువురు పండితు లౌలౌనసప్రాసి తన కీర్తిచంద్రికల నెల్లయెడల వ్యాపింపఁ జేసిన కోలాచలము శ్రీనివాస రాయ[illegible]ము డాంధ్రలోకంబునకుఁ జిరపరిచితుండు గావున నాతని నాటక రచనా విశేషంబుల నుగునఁ బూనుట మెగ్గుగఁ బరిగణింపఁ బడునేమో! ఆంగ్లేయ భాషయందుఁ బ్రపంచ నాటక చరిత్రమునే రచించిన మహాశయుని నాటకానుభవ మిట్టిదని వ్రాయఁ బూనుటకంటె నూహింప వినుచుటమేలు. ఆకవి శిఖామణి రచించిన నాటకములలో నే యితర నాటకంబున కెందును దీసిపోవనిదై వెలయు నీ "అర్జునగర్వభంగము" తన పాత్రకోత్తముల మరులుగొలుప నిప్పుడు బయలు వెడలియున్నది. ఆంధ్రులాదరింపఁ బ్రార్థితులు.

భారతయుద్ధానంతర మర్జునునకుఁ గల్గిన గర్వభరంబు నివారించుటకై శ్రీకృష్ణుండు సంకల్పించి, జైమిని భారత వీరుల నతని కెదురొడ్డి, యనుగనుగున కాకిరీటికిఁ బరాజయ మొదవించుచుఁ, దుదకు బభ్రువాహనుచేఁ జంపించి, మరల ననుగ్రహించి బ్రదికించుటయే యిందలి యితివృత్తము. కావున ముక్కాలు మువ్వీసము జైమిని భారత కథ దీసనిమిడి యున్నది. అంతమాత్రము కాక, ప్రదర్శనంబున కనుకూలముగ నుండి దిదృక్షువుల నాకర్షించి యానంద పరవశులఁ జేయ నందందుఁ గొన్ని చిన్ని మార్పులొనర్పఁ బడియున్నవి.

ఇంతియకాక యవశ్యము వ్రేలిడి చూపవలసిన యొక విశేష మిందుఁగన్పట్టుచున్నది. అదేదన నీనాటకమునఁ బెక్కు స్త్రీపాత్రములు మిక్కిలి ధీరములై పురుష పాత్రములకెందును వెనుదీయ కుంటయకాక ధైర్యసాహసంబుల వానిని మించియుండునట్లు చిత్రింపఁబడియున్నవి.

అగ్నిదేవుఁడు సైతమర్జును నెదుర్కొన నోడి యున్నను జ్వాలాదేవి కార్యమునకుఁ బోనొల్లని తనపతియగు నీలధ్వజుని బిఱికితనమున సంరంభమునఁ బలికెను.

"చం॥ పదనమునందు భాసిలెడు వాలగు మీసలుఁ దీసివేయుమా!
వదలుము నీకరస్థమగు వాలము; వేడుకఁ జీరఁగట్టుమా!
పదిలముగాఁగ నంతిపుర భామలఁజేరుము; యల్లమాజడల్
కుదురుగ గాజులన్ దొడిగికొన్న కనంబడఁ గొప్పఁజెక్కుమా!"

అను పల్కులఁ దిలకించినప్పుడును, నా మాటలచేఁ బ్రోత్సహింపఁ బడిన నీలధ్వజుఁడు సమరంబున కరిగి యోటుపడి వెనుదిరిగివచ్చిన వేళ మరల జ్వాలాదేవి పలికెను.

"చం॥ అరులనెదిర్చిపోరుచు జయంబును దెచ్చిన క్షత్రియుండె, హా!
పురుషుఁడు; వానిపొందుఁగనియుండెడు దారయ, దార; క్షాత్రవం
తురయయి పైనఁబడ్డతతి యుద్ధము సేయక పాఱినట్టి కా
పురుషుని మోముఁజూడఁగనె పొందు నఘంబు జనాళికెల్లెడన్."

అనువాక్యములఁ జూచినప్పుడును నీ జ్వాలాదేవి యెంతటి ధీమతిగా నొనర్పఁ బడియుండుట స్పష్టమగుచున్నది.

అంతనెపోక యాతరుణి యర్జునున కహితంబుఁ గూర్చుపని తాను కైకొని యతిచతురతతో గంగాదేవిచే

"గీ॥ కపట వృత్తిఁబూని కార్యంబు నందున;
శివుఁడునాఁడు సుతుని నేఁచిచంపె.
నట్టివానిశిరము నట్టెనఁదెగఁగాఁ
దనదు సుతునిశిరముఁ దప్పులఁజేసి."

అనుశాపము పార్థున కిప్పించువఱకును మానక పట్టువట్టి సాధించుటఁ జూడఁ బురుషులకంటె స్త్రీలు సాహసంబున నాలుమడుంగు లెక్కుడని నిరూపించిన యార్యుల వచనములు జ్ఞప్తికి వచ్చుచున్నవి.

ఇంక ధర్మజుని సవనహయంబు ప్రమీలారాజ్యమును బ్రవేశించిన తఱి నా మహాయోధస్త్రీసమూహ మొనర్చు చేష్టాదికములఁ జదివియే తీరవలయుఁగాక వర్ణింపఁగాదు.

మఱియొకచోట బభ్రువాహనుఁడు పార్థుచేఁ దిట్టువడి మరలివచ్చి జననితోఁ గయ్యమొనర్చుట పాడియా గాదాయని చింతించుతఱి నాతని పెద్దతల్లి యులూపి యాడిన వీరాలాపములు కడుంగడు ప్రశంసాపాత్రములు.

ఇట్టి కాంతా ప్రాముఖ్య మీ నాటకంబునఁ బెక్కుచోట్లఁ గానవచ్చుచున్నది. అరసి చూడఁ, సాధారణంబుగా నీకవి రచించిన యితర నాటకములందును గొలఁదిగనో గొప్పగనో స్త్రీలు మిక్కిలి ధీరలుగఁ జిత్రింపఁబడియున్నారు. ఇది యీ కవిరచించిన నాటకములందలి ముఖ్యగుణము. తరుణుల కబలాత్వమన్నిచోటుల వర్తింపదని నిరూపించి యీకవి యొనర్చిన దేశోపకారము శ్లాఘనీయము.

ఈ కవితిలకుఁడు రచించిన యితర నాటకములవలెనే యీ నాటకమును బండిత పామరుల గౌరవాదరములఁ బడసి తనుగన్నవానికి శాశ్వతకీర్తి నొడఁగూర్చుఁగాక.

బళ్లారి,
26-1-1923.

ఇట్లు విన్నవించు నొక
భాషాభిమాని.

ఈ శ్రీనివాసరాయకవివర్యుని యెడ నత్యంత వాత్సల్యమును నాంధ్రభాషాసరస్వతి యెడ నత్యంతభక్తియుఁ గల మొలగవేలి చిన్న సంజీవరెడ్డిగారీనాటకమచ్చుపడుటకయ్యెడు ధనవ్యయమును భరించియున్నారని యాంధ్రలోకమున కెఱింగించుట కెంతయు సంతసించుచున్నాఁడను. ఇట్టి భాషాభిమానుల కాపరమేశ్వరుఁ డాయురారోగ్యముల నొసంగి యింకను నిట్టిదేశోపకార కార్యముల నొనర్పఁ బ్రోత్సహించుఁగాక.

ఇట్లు విన్నవించు,
కె. శత్రుఘ్నరావు.

# శ్రీనివాససుకవి జీవిత చరిత్ర.

ఎవ్వానినడవ రాజీవరంగస్థలంబున నలువరాణి నిచ్చలును నట్టువలు సలుపుచుండునో! ఎవ్వాఁడు కువ్యాఖ్యావిషమూర్ఛితయగు కాళిదాస కవితాసుకన్యకను దనదు సంజీవినిచేఁ దెప్పిఱిల్లఁజేసి, వెజ్జలమిన్నయని వన్నెకెక్కెనో! ఏమహామహుని దివ్యనామామృతమును వీనులారఁగ్రోలని యక్షరాస్యుఁడొక్కఁడైన నీభువిని గానంబడఁడో! ఏమహితచారిత్రుని యశఃకుసుమంబుల ధరించి దివాకర నిశాకరులు పుష్పవంతులను సార్థకనామమును బడసిరో!

ఏవిద్వద్వతంసుఁడు అనన్య జనసామాన్యమగు మహామహోపాధ్యాయ బిరుదమునకు మూర్ధన్యుడయ్యెనో! అట్టిముఖీకృత సకల శాస్త్రజలధియగు కోలచల శ్రీమల్లినాథసూరి వంశమున మఱ శ్రీనివాస కవిముక్తామణి విరూపాక్షక్షేత్రమునకు సమీపమునందుఁ గామలాపురమను గ్రామమునఁ గ్రీస్తుశకం 1854-3-13 తేదిలకు సరియగు ప్రమాదీచ సంవత్సర ఫాల్గుణాసిత చతుర్దశినాఁడుద్భవించె. ఇతఁడు బాల్యముననే సంస్కృతభాషను జక్కఁగ నభ్యసించి, పిదప నాంగ్లేయ భాషయందసమానమైన పాండిత్యమును గడించి, కొంతకాలము రాజకీయోద్యోగిగనుండి, తర్వాత న్యాయవాదిపరీక్షలయందు తీర్ణుఁడై, బళ్ళారి పురవరమున న్యాయవాదిగ వఱలుచుండె. ఇతనికి నొకకూఁతురును, నలుగురు కుమారులును, గలరు. మఱియు నితఁడు 1917 సం॥ ఏప్రిల్ 7-వ తేది దేహళీపురమున జరిగిన విద్వత్సభయని ప్రసిద్ధిఁగాంచి యాంధ్రసాహిత్యపరిషత్సభకగ్రాసనాధిపుఁడుగ నియమింపఁబడియుండె. ఇట్లుండ నేతత్కవిచంద్రుఁడు రాజపరిపీడితుఁడై యాంధ్రకవులయంబు వసివాడఁగ కవిచక్రంబు లిల్లసిల్ల 1919 సం॥రం జూన్ 23-వ తేది యస్తమించె.

ఇట్లువిన్నవించు సుధీజనవిధేయుఁడు,

☞ రావాడి వెంకటరామశాస్త్రి,

తెలుఁగు పండితుఁడు,

మునిసిపల్ హైస్కూలు, బళ్ళారి.

# పురుష పాత్రలు.

---

1 ధర్మరాజు

2 భీముఁడు

3 అర్జునుఁడు

4 నకులుఁడు

5 సహదేవుఁడు

6 రాజులు

7 శ్రీకృష్ణుఁడు

8 సాత్యకి

9 అనిరుద్ధుఁడు

10 వృషకేతు

11 బ్రాహ్మణులు

12 నీలధ్వజుఁడు

13 మంత్రి

14 అగ్నిదేవుఁడు

15 నావికులు

16 సౌబరిముని

17 హంసధ్వజుఁడు

18 శంఖలిఖితులు

19 సుబుద్ధి

20 భటులు

21 సుధన్వుఁడు

22 విశ్వేశ్వరావధాని

23 మేఘోహోత

24 బ్రహ్మరాక్షసి

25 శిష్యులు

26 మలహూలత

27 సరహూలత

28 భీషణుఁడు

29 బభ్రువాహనుఁడు

30 ప్రతాపుఁడు

31 జయరత్నము

32 భట్టు

33 దుర్బుద్ధి

34 దుస్స్వభావుఁడు

## స్త్రీ పాత్రలు.

1 జ్వాలాదేవి
2 గంగాదేవి
3 ప్రభావతి
4 లీలావతి
5 శాంతిమతి
6 ప్రమీల
7 సుశీల
8 సుచేల
9 సులీల
10 వినీత
11 విలోల
12 గుణజాల
13 తమాల
14 అవలీల
15 సుకుంతల
16 సువాల
17 విశాల
18 శకుంతల
19 కమల
20 విచికల
21 హిమాచల
22 కోకిల
23 చిత్రాంగద
24 ఉలూపి



శ్రీ

జైమిని భారతము

# అర్జున గర్వ భంగము.

## నాంది

### సూత్రధారుఁడు.

ఉ॥ శ్రీవిలపిల్లి ధర్మజుని సేమముఁ జిత్తమునందుఁ గోరి యా
గావన ధుర్యుఁడై వెడలు పశ్చిమ ప్రాంతముఁ గాచి; సర్వలో
కావళి, బొజ్జలో నిడుచు నంతట నుండెడు నమ్మతుండుఁ; సౌ
ఖ్యావహ సంపదాయువు లుదారతనిచ్చును మీకు నెల్లెడన్.

[ అనుబంధము 1. ]

సీ॥ భారతీయ కవిసార్వభౌముఁడై నాటక
కవి చక్రవర్తియై క్రాలు నెవఁడు ।
ప్రాపంచ నాటక ప్రథమోర్జితాదులఁ
బ్రకటించి బోధించు ప్రాజ్ఞుఁడెవఁడు ।
చరితాంశ నాటక సారపూరితములౌ
రూపకంబు లొనర్చె రూఢి నెవఁడు ।
స్వల్పకాలమునం దనల్ప నాటక కావ్య
రచనల కోటిచే రహి నెవండు ॥

గీ॥ అభినయ జ్ఞాన సంపూర్ణ తాధికారి ।
యై తెలంగెడు రసిక శిఖావతంసు ।
డెవఁడు బళ్లారి పురములో నెలమిగాంచు ।
వాసిఁగనినట్టి కే. శ్రీనివాసుఁడతఁడె॥

# బభ్రువాహన నాటకము.



## ప్రథమాంకము—ప్రథమరంగము.

(ధర్మరాజు, భీమార్జున, నకుల, సహదేవులు, కొందఱు రాజులు, శ్రీకృష్ణులు, సాత్యకి, అనిరుద్ధ, వృషకేతు, బ్రాహ్మణులు.)

ధౌమ్యుఁడు, బ్రాహ్మణుఁడు—ధర్మతనయా! అశ్వపూజ సంపూర్ణమాయెను. ఇఁక నీ బిరుదులను బంగారు ఫలకమున లిఖించి, గుఱ్ఱమునుఁబట్టి కట్టువారిని జయింపఁగల వీరాధి వీరులను దీని వెంబడించి పోవులాగున యాజ్ఞయిమ్ము.

ధర్మరాజు—(కృష్ణునిఁజూచి) కృష్ణా! నీ యానతిలేక, నేనావగింజంతపనిఁ జేయనోప. గావున నీ బ్రాహ్మణోత్తములు నుడువు కార్యంబునకు నెవ్వరర్హులో, తురగ లలాట ఫలకమునందేమి లిఖింపవలెనో, యవి యెల్లను నీవే దీర్చుమని ప్రార్థించెద.

కృష్ణుఁడు—ధర్మతనయా! దీనికింతగ మాటలేల? అశ్వమును వెంబడింపఁదగిన శూరుఁడు మన యర్జునుఁడున్నవాఁడుకదా? ఇఁక గుఱ్ఱపు ముఖముపైఁ గట్టఁబడు ఫలకముమీఁద నీపద్యమును వ్రాయఁదగును.

మ॥ యమిలోకావనుఁడైన ధర్మజుఁడు సత్యశ్రీయుతుం, డశ్వమే
ధముసేయన్ దలపెట్టి, యాహయమునున్, దాఁబంపె, దేశాళిస
ర్వమునున్ గ్రుమ్మరిలంగ, దానినెవఁడే వ్వారింపఁగాఁ గ్రీడి వే
గమె వానిన్ దెగటార్చి తెచ్చును, దురంగంబెల్లరున్మెచ్చఁగన్ ॥

ధర్మజా! ఇంతయు చాలును. ఇఁక దీని రక్షగ వెంబడింప మన ఫల్గును నకు నానతి యిమ్ము.

ధర్మ—(అర్జునుఁజూచి) సోదరా!

ఉ॥ అథవ్రునెదిర్చియోర్చితివి యాజినినెల్లరుఁగాంచి మెచ్చఁగన్,
శుభముల నింద్రుఁడుండఁగను బ్రుక్కఁగఁ జేసితివీవు దైత్యులన్,
త్రిభువనముల్ నుతింపఁగను ద్రెళ్ళఁగఁ జేసితివీవు భీష్ము, దు
[illegible]ను నెట్లు దుగ్విజయలాభము? సోదర! క్షేమమందుమా॥

సోదరా! ఇట్టి నీవు దిగ్విజయలాభం బందుదువనుటకు సందియంబు లేదు. శుభకాలమ్మిది. వేగన్మై తురంగము వెంబడింపుము.

అర్జును—అగ్రజా! తమ యానతి శిరసావహించి యొనర్చెద.

[ అనుబంధము 2. ]

కృష్ణుఁడు—అర్జునా! నీ భుజవిక్రమమువల్లను, నీ శరలాఘవము చేతను, నీ యస్త్ర సంపద సాహాయ్యమునను, నీవు దిగ్విజయ మొందుదువనుటకు సందియములేదు. అయినను భారత రణాంతమున, నిలిచిన రాజు లెల్లరు, హరిభక్తులు కావుననే భుజసత్త్వ సంపన్నులు కావున వారి నెదిరించి జయించుట దుస్తరము. హెచ్చరికఁగఁ బోవలసినది.

అర్జును—కృష్ణా! వెఱవకు.

చ॥ సురులకుఁగాను రాక్షసుల బ్రుక్కఁగఁ జేసితి నీటిలోన, శం
కరు నెదిరించి గెల్చితిని కాననసీమను; మేటికయ్యమం,
దరుదుగ ద్రోణభీష్ముల రణావనిఁ జంపితి; నా కసాధ్యమే
ధురమునఁ దుచ్ఛభూపతులఁ దున్మాడు కార్యము? పోయివచ్చెదన్॥

కృష్ణుఁడు—అర్జునా! నీవు సురక్షితముగఁ బోయిరమ్ము.

[అర్జునుఁడు నిష్క్రమించును.]

కృష్ణు—(స్వగ) తాను శస్త్రాస్త్ర సంపదకలవాఁడననియును గాలకేయాది రాక్షసులఁ జంపితిననియును, శంకరునితోఁ బోరి పాశుపతాస్త్రము వరంబుగఁ గొంటిననియును, గురుభీష్మాది యోధవరుల గూల్చితినని యును వీనికి గర్వంబుతలకెక్కినది. ఈతూరి వీనికిముఖభంగమగును. ననుఁబొందినవానిని నరిషడ్వర్గంబులలో నెద్దియేని యాశ్రయించుకొని నచో, దానిని వదలింపఁ జేసి చక్కని మార్గమునకుఁదెచ్చుట నాపని. కావున నిప్పని నే నొనర్చెద. [నిష్క్రమము.]

## ద్వితీయ రంగము.

(నీలధ్వజుఁడు, మంత్రి, అగ్నిదేవుఁడు, జ్వాలాదేవి)

నీలధ్వజుఁడు—(అగ్ని దేవునిఁజూచి)

ఉ॥ పావక! నీవువాగృహముఁ బాయక యుందువు సర్వకాలముల్,
గావున నెట్టిభీతియును గల్గదునాకని నమ్మియుంటిఁగా
నీ విపుడేల శాత్రవుల నీఁటుమకేయక వచ్చితయ్య, నా
భావుక మెల్ల నీఱగును, పార్థుఁడు నాపురిఁ జొచ్చెనేనియున్॥

అల్లుఁడా! నీవేల రణరంగముమాని మరలివచ్చితివి? శాత్రవులు విజృం భించి కేకలు వేయుచు నగ్గలంబగు మొగ్గరంబులచే లగ్గుఁ బ్రయ త్నించుచున్నవారే? పార్థుని నిరాఘాట మగుఘాటి నడ్డగింప నీ దివ్య సాహాయ్యముఁదప్ప నా తరమగునా? అగ్ని దేవుఁడు నీలధ్వజుని యిల్ల టపుటల్లుఁడు కావున పరిరాజులాపురిని మోమెత్తియైనఁ జూడనోపరని జనులాడు వంభిపు నచనమ్ములు నేటికి వమ్మయ్యెనుగదా? అలనాఁడు నీ వడిన ప్రమాణము నమ్మిగదా నాగారాబు కూఁతురగు స్వాహాదేవిని నీకిచ్చి వివాహ మొనర్చితిని.

అగ్ని—మామా!

ఉ॥ మానుమ పోరుమాటలిఁక మామ! ధనంజయుఁడై కిరీటి, తా
సేనను గాచుచుండెను విచిత్రగతిన్, విఫలమయ్యె నాబలం,
బా నరు తోడినీడగుచు నచ్యుతుఁడెక్కతి నిల్చియుండు; నీ
యానసుమా! దురంబువిడి యర్జును మైత్రిని నుండ మేలగున్॥

మామా! రణభీరుఁడనై యాను మాటలు కావివి. విజృంభించి నీ సుతునకుఁ దోడ్పడి యుద్ధమొనర్చుచుండ, ఫల్గునుని పోటు బలమయ్యెను. దానిని సైఁపనోపక సేనాగ్రహంబున పార్థుని చతురంగ బలమెల్లఁ గాల్పఁ దొడంగితి. అర్జునుఁడు నన్నుఁ బలువిధముల వేఁడికొనెను. దానిని నే లక్షింపక మరల విజృంభించితిని. దానికిఁ గిరీటి కినిసి నారాయణాస్త్రము ప్రయోగింప నది యమోఘంబని దానిని శరణువేఁడి పార్థునితో నెయ్యము సలిపి కయ్యము మాని వచ్చితిని. ఇఁక నీవు నర్జునునితో సంధియొనర్చికొని సవనాశ్వంబు నతనికప్పగించుట శ్రేయస్కరము.

నీల—(జ్వాలాదేవింజూచి) దేవీ! మనము వన విహారంబు సలుపుతఱి నా యధ్వర హయంబును నీవుఁగని దానినిఁ బట్టియిమ్మని వేఁడఁగ వినోదమని దానిఁ బట్టియిచ్చితిని. వినోద మనర్థ మాయెను. ఇపుడా హయంబును రయంబుగ నర్జునునకు నప్పగింపమేని గీడు మూడునని మన జామాత హితంబుపదేశించుచున్నవాఁడు. నాకును నా రాజ్యంబునకును నది క్షేమంబని నేనెన్నెద.

[ అనుబంధము 3. ]

జ్వాల—ఏమీ! నాథా! ఏమిమాట లాడితివి. భీరువాడఁదగిన మాటలు శూరుఁడాడఁదగునా? మగువ యాడఁదగిన మాట మగవాఁడాడ

నగునా? అంగన కంతఃపురంబు కాంతి హెచ్చించి నటుల, పురుష నకు రణరంగము కాంతి హెచ్చింపఁజేయునుగదా? ఇఁక నీ జామాత మాటలు నిజమని నమ్మితివియా? ఈ జామాత మన ఇంటికి దశమ గ్రహముగ నున్నవాఁడు. ఇతఁడు మన కల్లుఁడు కాఁడు. మన యశః పటమున కంటినముల్లు. తన వచనభ్రిష్టతకై నను జరికేవు. నాథా

కం॥ పట్టిన కార్యము వదలుట
పట్టగునే యెందు భూమి పాలకులకు? నీ
పట్టిన హయమును వదలిన
రట్టగు; నామాట హితము, రమణా వినుమా!

నాథా! పట్టినపట్టుదల వదలుట రాజధర్మము కాదు. తనకు సముఁడగు శత్రువు యుద్ధమునకు దొరకుట దుర్లభము. దొరకినపుడు రణ మొన ర్పక శరణని రిపు పాదాక్రాంతుఁడగుట నీచ క్షత్రియునకుఁ జెల్లునుగాని యుత్తమ బాహుజునకుఁ జెల్లదు. ఈ యగ్ని విశ్వాస ఘాతకుఁడు. తిన్నయింటినిఁ బెకలించువాఁడు. తన ప్రాపున నమ్ముకొని యుండు వారి యెడనమ్మక ద్రోహ మొనర్చి చంపువాఁడు. కావుననే యాశ్ర యాశుండని యితనికిఁ బేరు వచ్చినది. ఈ ధనంజయుఁడు కనుపుబ్బఁ దిని యజీర్ణరోగంబునఁ బీడితుఁడై యుండ నా ధనంజయుండు ఖాండవ వనమును మందునిచ్చెను. ఆ కారణంబున నితఁడా యర్జునుని పక్ష మూని నిన్ను భక్షింపఁ జూచుచున్నవాఁడు. మోహనాంగా! ఈ బహుభక్షకుని మాటలు సరకుఁ గొనక దురమునకు వెడలుము. గెలి చినచో ధరనెల్ల నేలుదువు. మడసినచో సురరాజ్య మేలుదువు.

నీల—నాతీ! నీవాఁడుదానవు కావున కర్తవ్యాకర్తవ్యంబులు దెలియక, వెనుకముందాలోచింపక, మేలుకీళ్లెఱుఁగక, మాటలాడు చున్నావు. అర్జునుఁడనిన సామాన్యుఁడా?

నీల— సీ॥ కాలకేయాదులఁ గలనలో గెలిచిన శూరాగ్రగణ్యుఁ డర్జునుఁడె యతఁడు

జ్వాల— మునియాగ్రహంబున మనికిపట్టునులేని దితిజులఁ జంపుట దిట్టతనమె?

నీల— ఎక్కటికయ్యమందీశ్వరుఁ గెలిచిన పటుపరాక్రమశాలి ఫల్గునుండు

జ్వాల— కారుణ్యమునుగను పౌరాణ పురుషుని నెదిరించు పనియెంత యేపా తెలియ?

నీల— పవనమిత్రునకు ఖాండవమేర్చి యిచ్చిన సత్త్వశాలి యతండె సవ్యసాచి

జ్వాల— ఇలుపురుజతఁగూడి యింగలం బంటించి యింధనంబులఁగాల్చు టెంతపనియొ?

నీల— కురుముఖ్యు భీష్ముని నురుశరావళినాజి గెల్చిన శూరుఁడు క్రీడియతఁడె

జ్వాల— అలశిఖండినినడ్డు పెట్టిడాఁగుచుఁదన తాతను జంపఁగ ధర్మమగునె?

నీల— గీ॥ అఖిల శస్త్రాస్త్ర విదుద్రోణు నాజినోర్చి

జ్వాల— అనృతమాడుచుఁ గెలుచుట యగునె నీతి

నీల— ధీరుఁగర్ణుని గెలిచిన శూరుఁడితఁడె

జ్వాల— శాపహతుఁజంప నెంతటి సాహసంబొ॥

నీల—ప్రేయసీ! పటుపరాక్రమశాలియగు పార్థుని పౌరుషంబు నేనెంత నుతించి యెత్తి పలికినను, నాస్తోత్ర విషయమునం దేదోయొక నింద నారోపించి నీవు పలుకుచున్నావు. ఏనాఁడును నీవు నాయెదుట నిలిచి యిన్నింతగ ధిక్కరించి పలికినదానవు కావు. అది యేమికారణమో? నేడిచ్ఛానుసరణి నీనోటికి స్వాతంత్ర్యమిచ్చితివి. నీమాటలు నే వినను.

జ్వాల—నాథా! నిజము పలికితివి. ఇదివఱకును నీవు వీరాధి వీరుఁడవని నినుఁ బూజించుచుంటిని. నేను వీరసతినని గర్వించి నిక్కియుంటిని. నేఁడది వ్యతిక్రమంబయ్యెను. ఆ బీభత్సునకు సవనాశ్వమప్పగించి శరణాగతుఁడగుట కంటెను బీభత్సము మఱియొద్దియు లేదని నాతలంపు.

నీల—నాథ! అోతయనక, నీవీరీతిఁ దులువకూఁతలు కూయుట తగదు.
వెడలిపొమ్ము.

జ్వాల—అటులనా! (కోపముగాని)

చం॥ పదనమునందు భాసిలెడు వాలగు మీసలఁ దీసివేయుమా!
వదలుము నీకరస్థమగు వాలము; వేడుకఁజీరఁ గట్టుమా!
పదిలముగాఁగ నంతిపుర భామలఁ జేరుము; యల్లుమాజడల్,
కుదురుగఁ గాజులక్క దొడఁగి కుప్పెకనంబడఁ గొప్పఁ జెక్కుమా!

నాథా! బరువుచేటుగ బారెడు మీసములు పెట్టుకొననేల? తీసివే యుము. హస్తభూషణముగ నీకృపాణమేల? అది నాకందిమ్ము. పౌరుష నిరూపణకునై తలపాగయు సంగరేఖయు ధరింపఁనేల? చీర గట్టి అవికేఁ దొడుఁగుము. సింహాసనాభరణమ్ముగ నినుఁబోలు పిఱి యుండనేల? అంతఃపురంబుఁజేరి నారీగణ భూషణముగ నుంచుము. నేనిపుడేపోయి యాయర్జునుని రూపుమాపెద.

[ అనుబంధము 4. ]

నీల—(అగ్నినిఁజూచి)పావకా! జూచితివియా! మాయస్త్రీకు నేఁడు భూత వేశమైనది. నారియయినను బౌరుషము హెచ్చయినది. ఈ మగు మాటల పోటులు నాకు హృదయ శల్యములై బాధించుచున్నయవి అవమానాగ్నిలోఁబడి కాలుచున్నట్లు నాశరీరము తపించుచున్నయది ఇచట నేనిలువఁజాల. యుద్ధరంగమునకుంబోయి సవ్యసాచితో యు మొనర్చెద. జయాపజయంబులు దైవాధీనంబులని తలంచెద. ఇచ యింతవేని నీవు నాకు సహాయ్య పడుము. (జ్వాలం జూచి) దే నీవాగ్భల్లములఁ గ్రుచ్చి నన్నుఁ జంపకు. నీవు లోనికి వెడలుమ నేనిపుడే యుద్ధమునకుఁ బోయెద. [నిష్క్రమము.

# తృతీయ రంగము.

---

(నీలధ్వజుఁడు, జ్వాలాదేవి).

నీల—(పటుగిడీ యూపిరి విడుచుచువచ్చి పరుపుపైఁ బడును.)

జ్వాల—(శ్రీఘ్రనడి చూచి) నాథా! ఇదియేమి? ఇంతగ నాయాసపడు చున్నవారు. యుద్ధమేమాయెను? మీ శరీరమెల్ల రక్తము నిండి ప్రవహించుచున్నదదియేల?

నీల—(నిట్టూర్పు విడుచుచు) ఓసీ! చెడుగా! నీ యనిష్ట ముఖమును నేను జూడనోప. ఇచటినుండి వెడలి పొమ్ము. నా యింటినుండి వెడలి పొమ్ము. నా పురమునుండి వెడలిపొమ్ము. నా రాష్ట్రమునుండి వెడలి పొమ్ము. నిలువవలదు. వెడలుము. పొమ్ము.

జ్వాల—నాథా! ఇంతగ నాగ్రహించెదవు కారణమేమి?

నీల—భ్రష్టా! కారణ మడిగెదవా? నీ పలుక కూఁతలకు సహింపనోపక కదా నేనింతటి చెడుగునకు గుఱియైతిని. జగదేకవీరుఁడగు నరుని కరిపై, పోరున నా శూరుని శరవారమును సైపనేరక శరీరము రుధిర ప్రవాహంబున మునుఁగచుండఁ బోరుమాని పాఱివచ్చితిని. మగుని మాటవిని వగలు దెచ్చికొంటిని. "స్త్రీబుద్ధిః ప్రళయంకరీ" యను నది నీనుండి స్థిరమయ్యెను. ఒకతూరి నీమాట వినినకారణంబున, నా బలమెల్ల నాశనంబయ్యెను. నా ప్రాణములు పోవునంతటి కాలము తటస్థించెను. ఇఁక నీవిచటనుండినచో నా యింటితనము పాడగును. నా ప్రాణములు పోవును. కావున నీ విచటినుండి యీ గడియనే వెడలుము. నీ ముఖమునేఁజూడనోప. ఇపుడే యిచటినుండి వెడలకున్న సేవకులఁ బిలిచి వెళ్లఁగొంటించెద. వెడలుము.

కం॥ చెలి గా నీవిట నిలువక
వెడలుము నా యింటినుండి వేవేగమె; నీ
విడఁగులికిఁ జెల్లవిచ్చట
పడిపొమ్మా దిక్కులేని బడుగయి భూమిన్.

జ్వాల—పౌరుషహీనా! శూరవారముతోఁ బోరి వారింబరిమ్మూర్ఖక నారిని జేరి నోరుపడిపోవులాగున వాదొనరించెదవా? మంచిది క్షత్రియ పురుషుఁడవై శాత్రవుఁడగు సర్జునునిఁజంపలేక యేడ్చుచున్నావు. క్షత్రియ తరుణినగు నేను వానిని జంపెద. నాబలంబు నీవు గననగు. నీయట్టి పిఱికికి దారనై నే నుండఁజాల.

చ॥ అరులనెదిర్చిపోరుచు జయంబునుదెచ్చిన క్షత్రియుండె, పో,
పురుషుఁడు; వానిపొందుఁగనియుండెడు దారయు, దార; శాత్రవుం
డురియయి హైనఁబడ్డతతి యుద్ధముసేయక పాఱినట్టి కా
పురుషునిమోముఁ జూడఁగనె పొందునఘంబు జనాళికెల్లెడన్.

కావున నీ మోముఁజూడనోప. నీయింట నుండనోప. వెడలిపోయెద.

[నిష్క్రమము.]

---

## చతుర్థ రంగము.

(గంగాతీరము.)

---

(నావ నడపువారు, జ్వాలాదేవి, గంగాదేవి, నావికులు.)

[అనుబంధము 5.]

జ్వాల—ఈ పావనగంగ మలయమారుతమునకు సలరుచుఁ దన తరంగములు డోలల బలెనూఁగుచుండ సంతసంబున మైమఱచి యున్నది

నా కార్యసాధనకుఁగాను నేనొక యుపాయంబుఁ బన్ని యర్జునునకు నొక యుపాయంబు యోజింపవలెను. మంచిది. ఈ యుక్తి సమంజసముగ నున్నది. ఫలించినచో నా జన్మసాఫల్యమవును. మంచిది. బెస్తవారు తీరముఁ జేరనిమ్ము.

(నావికులు సమీపించి)

టోషు—ఓరీ! మాటోడా! కనుపార బువ్వఁదిని వత్తము రా రా.

టోషు—మాటోడా! నీవెప్పటికిఁ దిండికిఁ జచ్చుచున్నావు. నేఁను వేకువనుండి పదితూర్లు ఈతట్టునుండి యాతట్టుకు, ఆతట్టునుండి యీతట్టుకుఁ దిరిగిన నొకరూక యయినను రాలేదుగదా? మన పిల్లపాపలు నేఁడెటు జీవింపవలెను? పస్తుపడి చత్తురేమోకదా?

టోషు— పిల్లపాపల జోలి యిపుడేల? చచ్చినఁజత్తురు. బ్రదికిన బ్రతుకుదురు. చచ్చినచో మాకాలి సంకెలి పోవును. బ్రదికినచో బిచ్చమెత్తికొని జీవింతురు. వారిజోలి నాకంటలేదు. మాకల్లంగడి గతియేమి? ఆ ముండాకొడుకు కొండయ్య దుడ్డియ్యకఁగల్లుపోయువాఁడు కాఁడే? అప్పడిగిన అగ్గి యగ్గి యయి మండునే? సాయంకాలము గతియేమి?

టోషు—నీకేమిరా యెచ్చటనుండియయినను దెచ్చికొందువు. కడుపు నిండ నాకుపిల్లలున్నవారు. మొన్నమొన్ననే పెద్దబిడ్డ రంగికి నోలియని యిరువది రూపాయలు దెచ్చికొంటివి. మఱల నింకొక బిడ్డ నమ్మఁజూచుచున్నావు.

టోషు—అట్టి రూపాయలెన్ని దినములుండునురా? పెండ్లికిఁ గూడిన వారికిఁ దాపడములో నిరువది రూపాయలు సెలవాయెను. పైపెచ్చుగ నిరువది రూపాయలప్పాయెను.

జ్వాల—నావికులారా! ఇటురండు. ఇటురండు.

జాటోడు— ఓరీ! ఆయమ్మ పిలుచుచున్నదిరా పోవుదము.

మాటోడు—నిజమురా. రమ్మ పోవుదము. (సమీపింతురు). ఏమమ్మా పిలిచితివి?

జ్వాల—ఓరీ! నన్నీ గంగను దాఁటించెదరా?

మాటోడు—అది యెంతటిపని ఒక హూఁకున దాఁటించెదము.

జ్వాల—మీా పుటుక తీరముపైకిఁ దేవలెను. దాఁటునపుడు గంగాజల మొక బిందువయినను నాపాదము సోఁకరాదు. అటులయిన మీాకు కోరినంత ధనమిచ్చెద.

జాటోడు—ఏమమ్మా! అటుమాటలాడెదవు మా తల్లి గంగ, పవిత్ర రాలే, దేశదేశములనుండి జనులువచ్చి యీా నీటిలో మునిఁగి తమ కంటెన గొప్ప పాపములఁ బోగొట్టుకొనిమెదరే?

జ్వాల—ఓరీ! ఆజోలి మీాకేల? ఈగంగ మిగులపాపిష్ఠి.

(నీటిలోనుండి గంగాదేవి వెడలి తీరముఁజేరి)

గంగ—ఓసీ! నీవెవతెవు? నన్ను దూషించితివేల?

జ్వాల—నేనెవతెనయిననేమి? నే నెంతటి పాతకియయినను నీయంతటి దోషిణిఁగాదు. నేను పుత్రవతిని కావున సతి పుణ్యురాలను.

గంగ—నేను మాత్రము పుత్రవంతురాలను గానా? అతిపూజ్యుఁడయి యోధాగ్రణియయి, కురుకుల పితామహుఁడై నిత్యబ్రహ్మచారి నుండు భీష్ముఁడు నా పుత్రుఁడుగదా?

జ్వాల—ఓహో! భీష్ముఁడు నీపుత్రుఁడనునది నిజమైనచో, నీపాప వృత్తికిఁ జేరికగ మృతాశౌచ పీడితురాలవై తివి. దూరమునకుఁ జనుము నిన్నంటఁదగదు.

గంగ—ఏమమ్మా! అదియేమి? నేనెటు మృతాశౌచ పీడితను?

జ్వాల—అయ్యో! పిచ్చిదానా! కారణంబు దుఃఖకరమ్ముగ నున్నది.

గంగ—అదియేమి త్వరలోఁ దెలుపుము.

జ్వాల—అమ్మా ఆ దుఃఖకరమగు వార్తను దెలిపెదను విను.

ఉ॥ కౌరవపాండవాళికినిఁ గల్గినకయ్యమునందుఁ గౌరవ
మ్మేరుచు నీసుతుండు, రిపుసేనల నుక్కడగింప, నైచకా
కారుఁడు ఫల్గుణుండు తనకున్ బరిరక్షగఁ గ్లీబునొక్కనిన్
సారథిగాఁగ నుంచుకొని చాటుగ డాఁగుచుఁ జంపె భీష్మునిన్.

గంగ—అహా! కర్ణకఠోరమివ్వార్త. (ఇంచుక దుఃఖించి) అమ్మా నా సుతుఁడు దివ్యాంశ సంభూతుఁడే. అజేయుఁడే. స్వేచ్ఛా మరణంబు గలవాఁడే. అట్టివానిని నొక తుచ్ఛమానవుఁడు చంప నెటుశక్యమగు? నీ మాటలు నే నమ్మఁజాల. వివరముగఁ దెలుపుము.

జ్వాల—అమ్మా! నే నవ్వార్త వినినంతవఱకుఁ దెలిపెదను విను. నీ సుతుఁడు, నపుంసకుని మోముఁ జూడననియును, నట్టివానిపై బాణం బులు వేయననియును గఠిన శపథముఁ జేసియుండెనఁట. ఆ రహస్య మర్జునుఁడెఱింగి యొక శిఖండియను నపుంసకుని తనరథము ముంగిటఁ గూర్చుండఁ బెట్టెనఁట. ఆ కారణంబున భీష్ముఁడర్జునునిపై శరములు

వేయ మానెనఁట. అత్తఱి నర్జునుఁడు తన తాతయని గౌరవింప
భీష్ముని మోసవృత్తిని శరంబులువేసి శరీరంబు నొవ్వఁజేసెనఁట. ఆ
బాధకుఁ దాళఁజాలక నీకుమారుఁడు శరశరాసనంబులు క్రిందఁబడ నై చ
నేలఁ ద్రెళ్ళెనఁట.

గంగ—హా! హా! దుర్భరము. దుర్భరము. ఆ యర్జునుఁడు కపటవృత్తి
గాని నాసుతునిఁ జంపెనా? ఓరా! మోసము.

చ॥ శపథమెఱింగి క్లీబుఁదనసారథిఁజేసి దొసఁడునిక్కి; తా
నపమతియై। దురంబునను న్యాయముఁదప్పుచుఁ జంపెనత్సుతున్
గృప। మదిఁగానవొల్లకను గేవలక్రూరత; నట్టిద్రోహినిన్.
శపితునిఁజేసి చంపెదను. శాతశరోపమవాక్యసంతతిన్,

(ఇంచుక నిమీలితాక్షియై)

గీ॥ కపట వృత్తిఁగాని కయ్యంబునందున;
నెవఁడు నాదుసుతుని నేఁచిచంపె.
నట్టివాని శిరము నెట్టనఁడుగుఁ గాతఁ
దనదు సుతనిశిరముఁ దఫ్లఁజేసి.

(అనుచు నీరు విడుచును.)

అమ్మా! ఈపుత్ర శోకంబు నే సైఁపఁజాల. పోయివచ్చెద.

(గంగ నిష్క్రిమము.

జ్వాల—(నావికులఁజూచి) ఆరకూటులారా! నా కార్యంబిచటనే తీరెనది
గంగాప్రవాహంబు దాఁట నక్కఱలేదు. మీరు పేదవారు. రిత్త
సింతవఱకు నిలిచితిరి. ఇదిగో నా హారము మీకు బహుమానము
నిచ్చితిని. పుచ్చుకొనుఁడి.

(నావికులు హారముఁ బుచ్చుకొని వెళ్ళిపోదురు.)

హా! హా! నా కార్యము ఫలించెను. నా వైరశుద్ధికి మార్గమాయెను. ఈ గంగాదేవి దైవిక శక్తికదా? ఆ సత్తిమాట రిత్తపోవునా? అయిన నా యర్జునునకు శ్రీకృష్ణుఁడు సాహాయ్యుఁడుగ నున్నవాఁడు. శ్రీకృష్ణుఁడు కపటనాటక సూత్రధారి. మున్ను ఫల్గునుని శిరము డెగఁ వేయఁగల కర్ణుని దివ్య వరశర వేగమును శ్రీకృష్ణుఁడు తన మాయా శక్తివలన మాన్పి, నరునిఁగాపాడఁడా? అటులనే యీ శరవరశక్తి నడంచుట కేమాయఁ బన్నునో? కావున నేను ఘోర తపంబొనర్చి యమోఘ శరరూపముసంది యర్జునుని పుత్రుఁడుగ నుండు బభ్రువాహనుని కరముసందు మెఱయుచుండెద. అప్పనికై నిర్జనాటవిఁజేరెద.

ఉ॥ వీరవరేణ్యు నర్జునుని, విక్రమశీలు శిరంబుఁ దీయఁగాఁ
క్రూరశరంబునై వెలయఁగోరుచు, నుగ్రతపంబొనర్చెదన్
శూరుని బభ్రువాహనుని శుభ్రకరాంచితనై మెలంగెదన్
భూరిగ వైరశుద్ధిఁగని పొందెద నాత్మశరీర శక్తిచే.

[నిష్క్రమము.]

---

—(పంచమ రంగము)—

[అర్జునుఁడు, సేన, సౌబరిముని, చండి. (అశ్వము). ].

జునుఁడు—(జాలిలోఁజిక్కుకొనిన గుఱ్ఱమునుఁజూచి విస్మయమంది).

క॥ తెచ్చవడి నిలిచె హయమిది
వచ్చెరు వయ్యెడిని మదిని నకటా; గతియే
మిచ్చుట నెవరిని నడుగుదు
నెచ్చటికేగుదును? నిక్క మెటు లెఱుఁగనగున్.

కర్తవ్యకార్యంబు నాకేమనుకది తోఁపదాయెను. దరిద్రుని మన
రథమురీతి హయము ముందడుగిడఁ జాలకయున్నది. సకల లీలల
వదలి చచ్చినదానింబలె నిలిచినది. నే నేమిచేయుదు? ఎవరి నడుగుదు
నాకేమియుఁదోఁపదు. ఆ దీనదయాళువగు శ్రీహరి తప్ప నాకన్యశ
ణంబులేదు.

ఉ॥ మందరధారి! శౌరి! శుభ్రితమాలికహారి! దయాప్రచారి! స
ద్బృంద మనోబ్జచారి! యరిబృందవిదారి! త్రిలోకధారి! యో
బంధురదుఃఖహారి! భవబంధవిమోచనకారి! శ్రీహరీ!
యెందును దిక్కుగాననిక నేమని నేమనువాఁడ నిక్కనిక్కన్.

(సౌబరి ప్రవేశము)

అర్జునుఁడు—(మునిఁజూచి)

మ॥ సతలోకావన, దీనబాంధవ, మహాసర్వైకరక్షామునీ
నతులర్పింతును మీపదద్వయముల న్సన్నాదరింపంగ, నా
యతివర్యా దయఁగాంచుమా; యటకనిన్ యాగాశ్వమీటాతిపై
గతచేతన్యగతిన్ వహించెఁగద నేఁగాన న్గతంబెద్దియో,

యతిజన పూజితపాదా! వందనంబు లర్పింతును. నేఁబాండవ మ
ముఁడను. పార్థివుఁడను. ధర్మజుని యాగాశ్వము రక్షింప దా
వెంబడించి వచ్చితిని. ఈ యుగపసుశిలపై నడచుతఱి నా హయం
చేతన్యంబుఁజెడి తిచ్చవడి నిలిచినది. కారణమేమో తెలియకున్న
మహానుభావా! హయంబిటులైన కారణంబున ధర్మజుని యధ్వరం
నిలిచిపోవును. దానికినై ధర్మరాజు కృశించి యేమగునో కద
తత్కారణంబునఁ బాండువంశంబే క్షీణించును. మునిసార్వభౌమా
ఏకారణంబున నీ యశ్వంబిటు స్తంభించి నిలిచెనో తెలియనై
ఈ కష్టాబ్ధి దరిఁజేర్చుమార్గంబు నాకుఁజూపి రక్షింతురని మీకుఁబ్ర
ణంబులర్పించెద.

శాబరి—అర్జునా! నీ వినయ విధేయతకు నే మది మెచ్చితి. చింతింపకు. ఈ శిల శాపతప్తయగు స్త్రీ. చండి యని దాని నామము.

అర్జును—మునిరాగ్రణీ! ఆ చండియను స్త్రీ యెవతె? దానికిట్టి శాపమేల లభించె?

శాబరి—అర్జునా! ఆ చరిత్ర యొకగాథగ నున్నది. సంక్షేపముగఁ దెలిపెద విను. చండి యనునది యుద్దాలక ముని భార్య. మగనిని మాట మాటకు నధిక్షేపించుచుఁ గూడని కార్యము లొనర్చుచు నకటా వికటము లనేకములు సేయుచుండ భర్త విసికి శిలారూపమునఁ బడియుండు మని శపించెను. చండి భీతిల్లి మగని పదములపైఁ బడి వేఁడికొన నతఁడు దయార్ద్రచేతస్కుఁడు కావునఁ బాండవమధ్యముని పాదములు నీపైఁ బడినతోడన శాపవిమోచనంబగునని శాపావధిఁ గలిగించెను. కావున నో యర్జునా! నీవా శిలను ద్రొక్కినచో యతి సతికి శాపవిమోచన మగును. నీ హయమునకు బంధవిముక్తి కలుగును.

అర్జును—యతివరేణ్యా! నా చింతకు నంతంబు గలిగించి స్వాంతమును సంతసమున నించిన మీకుఁ ద్రికరణశుద్ధిగ నా నమస్కృతులర్పింతును. (అనుచు మునికి వందనంబులిడి శిలనెక్కి గుఱ్ఱమును బట్టికొనిన తోడనె శిలద్రవ్యయ్యెనై చండియను మగువ లేచి ముందటికివచ్చి నిలిచి)

చండి—(అర్జునునిఁ జూచి)

కం॥ దుర్జనగర్వ విభంజన
నిర్జరవరసూను; శాపనిర్గతిఁ గంటిన్
అర్జున నీపదరజమున
నార్జింపుము భూరియశము ననమానముగన్,

అర్జునా! నీ పావనపదరజములు నిర్జరాయినవలెఁ బడిన నామేనంటి తోడనె నాకుఁ జేతన్యము గలిగి మున్ను బలె మానినినై మించితిని నా భర్త యెడల నే నొనర్చిన పాతకంబులెల్లఁ బటాపంచలై పోయెను నీ యశంబు దశదిశల నిండెను. నీవిఁక నాకు సెలవిచ్చినచో నా భర్తను గూడి సుఖమున నుండెద.

అర్జున—కం॥ సతిపుణ్యవతీ యతిశయ
సతులర్పించెదనునీకు నయవినయములన్
బతిఁజేరుము; యిఁక నేనీ
క్షితిఁగంటిని నీదుకతన గీర్తినిదల్లీ

(అనుచు నతులొనర్చును.)

[నిష్క్రమము.]

# బభ్రువాహన నాటకము.

## ద్వితీయాంకము.

### ప్రథమ రంగము.

[హంసధ్వజుఁడు, పురోహితులగు శంఖలిఖితులు, సుబుద్ధి, భటులు.]

హంసధ్వజుఁడు—

ఉ॥ భూసురవర్యులార; సురపూజ్యా, నిరామయు, శ్రీహరిన్, గనన్
దానునిమానసంబు నిరతంబును గోరెదు; మాగ్గమెద్దియో.
వానిలఁదెల్ప మీచరణ పంకజయుగ్మము నమ్మినాఁడ; నా
యాస ఫలింపఁజేయ, వినయంబుననమ్రత, నేనువేఁడెదన్.

శంఖలిఖితులారా! ఆ వందారు మందారుఁడగు గోవిందుని, సచ్చిదానందుని, లీలామానుష విగ్రహుని, శ్రీహరినిఁ గనులారఁగని యమితానందంబుఁ బొందని మానవజన్మంబు వ్యర్థంబని మదినమ్మి, నాకు మార్గ దర్శకులు మీరగుదురని మిమ్మాశ్రయించితి. మీ యాజ్ఞ శిరసావహించితి. నాకు వార్థక్యము సమీపించెను. ఈ జన్మమున, నా, నారాయణచరణ సందర్శన మగునో కాదో యని చింతిలుచున్నాను.

ంఖ—భూపతీ! నిరాశకుఁ గారణములేదు. శ్రీహరి భక్తాధీనుఁడు కావున నినుఁ గరుణించి, దర్శనమిచ్చి, ముక్తికాంతా సంయోగ సుఖంబు లభింపఁజేయును. నెమ్మదిగనుండుము.

(భటులు ప్రవేశించి)

టుఁడు—(వందనంబిడి)

మహాప్రభూ! తమ చిన్నకొమారుఁడగు సురథుఁడు మన యుపవనమున విహరించుచుండ నొక విచిత్రమగు, గుఱ్ఱమచటికి వచ్చెను. దానిని సురథుఁడు పట్టికట్టెను. పిదపఁ బాండుసుతుఁడగు నర్జునుఁడు సేనతో వచ్చి గుఱ్ఱమును విడువుమని యడుగ మా రాజగారు విడువరైరి. వారిరువురికిఁ గలహము సంభవించినది. ఇవ్వార్తఁ దమకుఁ దెలుప వచ్చితిమి.

ంఖ—హంసధ్వజా! చిరకాలాపేక్షిత ఫలమిపుడు నీకు సంప్రాప్తించు కాలమొదవెను.

ంసధ్వ—పురోహితులారా! అదిమెటులు?

శంఖ—ప్రభూ! శ్రీహరి పాండవ పక్షపాతియనుట జగద్విదితంబుగదా
అంతియుఁ బాండవ మధ్యముఁడర్జునుఁడు శ్రీహరికి నచ్చినమిత్రుఁడేగా
భావముండి. కావున నర్జునుని కేకష్ట మొదవినను శ్రీహరి సాక్షాత్క
రించి ఫల్గునుని, బాధలనుండి బాపుచుండును. నీవు నీపుత్రులంగూడి
రణ మొనరించితివేని గ్రీడి యోడిపోవుననుటకు సందేహము లేదు
అక్కాలంబున శ్రీహరివచ్చి నీకు దర్శనంబిచ్చును.

హంస—బ్రాహ్మణోత్తములారా! సహేతుకమగు మీ హితోపదేశంబ
నా మదికి సంతోషదాయకంబుగ నున్నది. కావున నవశ్యానుసర
యంబనుటకు సందియంబు లేదు. ఇపుడే నా పుత్రులంగూడి, పు
జనులతో వెడలి పార్థుని నెదిరించి యుద్ధమొనర్చి యోడించెద.

(భటులంజూచి)

భటులారా! మీరు వెడలి నా పురియందుండు యోధులెల్లరీసాయి
త్రికి మున్నె కోటవాకిలివద్ద గుమిగూడి యుండవలెననియును, నెక్కా
రణంబుననైనను దప్పి రేని కఠినదండనయనియును జాటింపుఁడి. వెళ్లుఁడి

(భటులు నిష్క్రమింతురు).

బ్రాహ్మణోత్తములారా! తాము గృహమునకు వెళ్లి నా విజయమ
నకునై సమస్తదైవోపాసనలు సేయుచుండుఁడి.

శంఖలిఖితులు—రాజా! అటులొనరింతుము. మందిరంబునకుఁ బోయి
వత్తుము.

హంస—అటు చేయుఁడి. నేనునుబోయి సమర సన్నద్ధుఁడయ్యెద.

(నిష్క్రమము)

## (ద్వితీయరంగము).

### అంతఃపురము.

(సుధన్వుఁడు, భార్య ప్రభావతి, చెల్లెలు లీలావతి, తల్లి శాంతమతి.)

సుధన్వుఁడు— (తల్లిసిఁగని వందనంబిడి)

శా॥ అంబా! ధర్మతనూజుఁ డన్నృపతి, యజ్ఞారంభదీక్షుండై, దురం
గంబుల్ లోకము సంచరింపవదలెన్; గాపాడఁగాఁ గ్రీడి శౌ
ర్యంబేపారఁగ వెంబడించెనఁట, పోరంబూని నాతండ్రియ
శ్వంబుల్ గట్టెను, యుష్మత్ప్రతిలేఁబోవన్ నన్ను దీవింపుమా.

తల్లీ! చిరకాలమునుండి సమర ముఖంబున నర్జునునితోఁ బోరి జయమార్జింపఁ గుతూహలముండెను. దైవానుగ్రహమున నిట్టి సమయంబు తటస్థించినది. శ్రేయస్కామివి కమ్మని దీవింపుము. వందనంబు లాచరించెద.

శాంతమతి— తనయా! నీకు విజయప్రాప్తియగుఁగాత. పుత్రా!

కం॥ హరిఁ గాపాడెడు క్రీడిని
హరి కాపాడుచును నుండు ననవరతంబా
హరిపశువు జేలపట్టఁగ
హరిపద కమలములఁబట్టియచ్యుతిఁగనుమా.

పుత్రా! నరుఁడు నాల్గుపాదములుగల యొకహరిని బాలించుచున్నాఁడు. సమస్త చరాచరకోటినిఁ బాలించు శ్రీహరిని సానందమునఁ గనులారఁ గని నీ మనోంబుజ పీఠంబున నీవు బంధించి యుంచి కొంటివేని శ్రేయస్కాముఁడగుదువు. నీ పౌరుషమునకు, నరుఁడొక లక్ష్యమా! నీవర్జునుని నొప్పించితివేని దూరముననున్నదూడ నావు వెదకికొని వచ్చులాగు శ్రీహరి కరుణాపూర్ణుఁడై యాశ్రితాభిమానుఁడయివచ్చును. నీవకాలంబున ధీరుఁడవై పోరొనర్చుచు శ్రీహరి సామీప్యముఁ జేరుచుండుముగాని భీరు వయి వెనుకకుఁ దిరుగకుము.

సుధ—అమ్మా! శాంతమతీ! నిరంతరాచ్యుత పదధ్యానైక నిరతుఁడగు
నేను శ్రీహరి, కంటఁబడినపుడు వదలి వత్తునా? అటు వదలివచ్చితినే
శాంతమతియగు నీకును, నా తండ్రియగు హంసధ్వజునకును దప్పి
వాఁడనగుదునుగదా? హరికింకరుఁడను పేరు నాకుఁదగునా? రణవీరు
డను బిరుదు నాకు నుండనగునా? ఆ శౌరి నెదిరి శౌర్యంబుఁజూపెద
జయాపజయంబులు దైవాధీనములని మదినమ్మెద. పోయివచ్చెద సెల
విమ్ము. (లీలావతినిజూచి) చెల్లెలా అర్జునునితోఁ బోరొనర్చి జయ
మార్జింపఁబోయి వచ్చెద.

లీలావతి—అన్నా!

కం॥ విజయుని నెదిర్చియాహవ
విజయంబార్జింప కీవువిచ్చేసితివేని ।
నిజముగ మానంబున, నా
స్వజనులకును మోముఁ జూప, సంతసనునుచున్.

అన్నా! నాపలుకులు నిజము. నీవుజయమార్జింపక మరలి వచ్చితివే
నా యత్తగారింట మానముగ నే మోముఁ జూపుటయు కష్టంబగును
ఇదియదార్థమని నమ్మము.

సుధన్వ—చెల్లెలా! లీలావతీ! నీవంతగ వెఱచెదవేల? రణభీరు
యాహవము వదలి మరల యీ సంసారార్ణవంబునఁ బడునంతటి ని
ష్ణుఁడునా నేను? ఎన్నఁటికి నటుచేయను నమ్ముము.

(ప్రభావతి ప్రవేశించును. శాంతమతి లీలావతి నిష్క్రమింతురు.)

[ అనుబంధము 6. ]

ప్రభావతి—(సుధన్వునిఁజూచి) నాథా! అదియేమో యొక కింవద
పుట్టినది. అది నిజమేనా?

సుధన్వ—బలుచక్కఁగనున్నది. ఇదికదా ప్రావీణ్యము? కింవదంతి యేమయినది తెలుపక యందుల సత్యాసత్య నిర్ణయముఁ గోరుచున్నావుకదా?

ప్రభావతి—నాథా! క్షమింపుము. పురుషులకు నున్నంత బుద్ధి స్త్రీలకెచటినుండి వచ్చును? మఱియేమియు లేదు. ధర్మరాజుయొక్క యధ్వరాశ్వ మిచటికి వచ్చియుండ మనవారు దానినిఁ గట్టినారఁట. దానినిఁ గాపాడఁ ద్రిలోక విజయుఁడగు విజయుఁడు వచ్చినాఁడఁట. వానితోఁ బోరొనర్పఁ బురివారందఱు నేఁడు పోవలయునఁట. ఇది నిజమేనా?

సుధ—రమణీ! నిజము. భువనైకవిజయుఁడని ప్రఖ్యాతినిఁగనిన విజయునితో సంగర మొనర్చి వాని బిరుదార్చి విజయ విజయుఁడని నేఁ బేరొంద బహుదినములుగఁ గాచియుంటిని. అట్టి సమయమిపుడు తటస్థించెను. కావున నా యీప్సితార్థంబుఁ ఫలీకరింపఁ జేయుటకయి పోవసిద్ధుఁడనై నాఁడను. నీ సెలవంద నిచటికి వచ్చినాఁడను.

ప్రభావతి—రమణా! నరుఁడు కేవల నరుఁడు కాఁడు. నారాయణ సమానుఁడని నేను విన్నాను. శరబాధితుఁడగు నరుని నారాయణుఁడు కాపాడుచుండును. నరుని నీవెదిరించిన నారాయణుఁడు నిన్నెదుర్చును. అపుడు నీవేమి సేయఁగలవు?

సుధ— సీ॥ నరుని నే నెదిరింప హరివచ్చెనేనియు హరిని నే నెదిరింతు నాజినబల.
ప్రభా— హరిని నెదిర్చిన ననువులు నిల్చునే వదలుమా రమణ నీకదనవార్త.
సుధ— సతి నేను హరికి నోడితి నేని మోక్షసద్గతి నాకుఁ గలుగును గాదె రమణి.
ప్రభా— అనపత్యునకు రౌరవాది దుర్గతిగాని సద్గతియెటులగు శాస్త్రవిధిని.
సుధ— గీ॥ వీరమరణంబు స్వర్గైక కారణంబు
మాధవుని దర్శనము మోక్షమార్గమగును.
ప్రభా— భ్రూణహత్యకు సమమగు భూరిదోష
మనని లేదని పలుకవే యాగమములు.

సుధ—రమణీ! నీవు సకలశాస్త్రాగమ విధులు నేర్చిన నేర్పరివి నిజమ
అయినను నా తండ్రి విధించిన కాలమాసన్నమైనది. తప్పితినేని క
దండన నా కగును. కావున వేగమ్మె నాకు సెలవిమ్ము.

ప్రభావతి—నాథా! పరలోకమునఁ గలుగు యమ దండనముకంటె
లోకమునఁ గ[illegible]గు నీ తండ్రి దండన హెచ్చా?

సుధ—రమణీ! నీపలుకు దోషయుక్తము. శ్రీహరి దర్శనమునఁ బ
పంచలై పోవును.

ప్రభా—నాథా! సమ్ముఖమున రాయబారమేల? స్వస్థానము వచించునపు
చుల్లీల. నేను ఋతుస్నాతనై నేఁటికిఁ బదునాఅవ దినంబగున
తుదిదినమిది. మఖనుండి విశాఖాంతమునకైన జలదములు వర్షిం
వేని, క్షేత్రమున బీజములంకురించునా? అంకురార్పణమునకుఁ ద
దివసంబిది. ఈదినంబున నన్నుఁ గూడి, యనపత్యదోషంబపనయిం
ప్రయత్నింపుము. ఫలించునని నాయంతరాత్మ దెలుపుచున్నది.

సుధన్వ—ప్రేయసీ! నాచిత్తమంతయు శ్రీహరి దర్శనాయత్త వృ
నున్నది. కాలము మీఱితినేని నాతండ్రి దండనకు గుఱియయి, ప్రా
ములు వదలుసమయము తటస్థించును. శ్రీహరి దర్శనంబు నాకునపు
దుర్లభమగును. కావున నే ఋతుధర్మభంగంబైన నోపుదును గా
నా తండ్రియాజ్ఞాభంగంబు సేయనోపను. రమాపతిదర్శనభాగ్యం
వదలఁజాలను.

ప్రభా—రమణా!

క॥ మగువను, ఋతుషోడశదిన
మగుసమయమునందు ప్రార్థమగు నేఁ, హరికిన్
దగుదినమగు నేఁ, గూడఁగ
నగుఁ బురుషునకనుచుఁ బల్కు వాక్యులెల్లన్.

ప్రాణపతీ! ధర్మమార్గములతిసూక్ష్మములు. నీతిశాస్త్ర విచారులవి యన్నియుఁ జక్కఁగ విచారించి స్మృతులొసరించిరి. పితృతిథియు, నేకాదశీతిథియు, ఋతుసమయము నొక్కటై సంప్రాప్తించినచో నవి లంఘ్యములగు మొదటి రెండు తిథులకు గౌణపక్షంబుఁ గల్పించి మూఁడవదియగు ఋతుసమయవిధి దాఁటఁగూడదని స్మృతులు ఘోషింపవా? ఈ విధినిఁ దప్పినవానికి భ్రూణహత్యదోషంబు వాటిల్లునని పలుకవా? భ్రూణహత్యదోషము ప్రాయశ్చిత్తార్హము కాదని నీతి విధులు వచింపవా?

...—నాతీ! నీపలుకులందు ధర్మమున్నదని నాకుఁ దెలియును. అయినను నా మనము శ్రీహరి ధ్యానమున లీనమైనది కావుననీకు నేనేమి యుబదులిడఁ జాలను.

భా—రమణా! నీ వనంగునిఁ గెల్వక యనంగ జనకుని గెల్చుటెటుల? కావున నన్నీరాత్రిఁ గూడి యంగజునిఁ గెల్వుము. పిదప నంగజు జనకుఁడు నీకు సులభుఁడగును.

...— మ॥ త్రిజగంబుల్ సృజియించుధాత తనపుత్రిన్ గూడె నెగ్గెన్నకా,
త్రిజగోద్ధారకుఁడైన శ్రీహరి సదా స్త్రీలోలుఁడై మించెఁగా
నిజదేహంబు సగంబునిచ్చె సతికిన్ నిర్లజ్జుఁడై యీశుఁడ
క్కజమౌ భామల హావభావములు లోఁగన్ జేయు నెవ్వారినిన్.

ఇదికదా! స్త్రీమహిమ. (ప్రభావతింగని) ప్రభావతీ! నీ ధర్మవాక్యములే గాక నీ దేహసౌందర్యంబును హావ భావ విలాస విభ్రమములుఁ గని నా మానసంబు చలించెను. కావున నీ యిష్టార్థంబు సఫలంబుఁ జేసెద. ఆలస్యంబేలరమ్ము.

[ అనుబంధము 7. ]



(తృతీయ రంగము.)

(సుధన్వుఁడు, భటులు, హంసధ్వజుఁడు, శంఖలిఖితులు, శాంతమతి తప్తతైల పూరిత కటాంజనము.)

హంసధ్వజుఁడు—(పిడిరెట్టలుగట్టఁబడినసుధన్వునిఁ జూచి)

శా॥ ఓరీ! దుష్ట! దురాత్మ! దుర్మద! భలా! యుద్దండవృత్తిన్, దురా
చారుండై, మరుకేళిలోఁదవిలి, నీచప్రక్రియన్, గాలమున్,
మీఱంగానగునే దురంబుపదలన్ మేలౌనె, నాయాజ్ఞ నీ
వీరీతిన్ జవదాఁటఁగాఁదగునె? నీ వింకన్మనన్ బోలునే?

ఓరీ! సుధన్వా! నీవువీరాగ్రగణ్యుండవని కసుమక్కువతో నినుబెంచితి. పామునకుఁ బాలుపోసి పెంచిన విధంబయ్యె. నాయాజ్ఞ యెట్టిబెట్టిదం బైనది నీవు వినియు నింత నిర్లక్ష్యముఁజేసితివి. కావున నీవంటిగర్వా గ్రేసరులకు భీతిఁగలిగింప నీకుఁ గఠినశిక్షయొసఁగెద. (శంఖలిఖితుల గని) రాజపురోహితులారా! వీఁడునాకొమారుఁడనిదాక్షిణ్యముంపక రాజునాజ్ఞ జవదాఁటినవానికిఁ దగినశిక్షయెద్దియో దానినిఁదెలుపుడి.

శంఖ—మహాప్రభూ!

గీ॥ ధరణిపాలుని యానతి దాఁటువానిఁ
బట్టుచును దప్తమగుతైల భాండమునను,
ద్రోయున్యాయంబు; మన్నింప దోషమగును
గానసటుసేయుమా, ధరాకాంత! వీని.

భూమీశా! వీనిని జలజలఁగ్రాఁగు నూనెలోఁబడఁద్రోయుము.

హంస—(భటులఁజూచి) భటులారా! వీనిఁగొనిపోయి యొక కటాంజనమున నూనెమర్లంగాచి, వీనినిఁ ద్రోయుఁడి (ఇంచుకయాలోచించి) ఓరీ! వీఁడు రాచకొమరుండని దయఁబూని యేదోయొక మోసము సల్పఁబూనెదరు. నూనెఁగాచి యుంచుడి. నే నెనటనుండి తోర్పియుంచెద.

శాంతమతి—ప్రాణేశా! ఈ కొమారునిపై నింతచలమేల? వీఁడంతటి మం తేమొనర్చెను! కాలమించుక మీాతెను, గాని కదనమునకు వెనుదీసెనా? సదాకాలంబు హృదంబుజంబున శ్రీహరి ధ్యానంబు నేమఱని యీ చిన్నకొమారునిపై మీాకింతటి కోపమేల! నవశిరీషకుసుమ కోమలమగు వీని యంగము తప్తతైలము నెటుసైఁచును? నాథా! వలదీదండన.

హంస—ప్రేయసీ! రాచకార్యములలో నీవు ప్రవేశింపకు. రాజధర్మములతిసూక్ష్మములు. రాజనీతులందు, సతిసుత బాంధవ్య దాక్షిణ్య పక్షపాతములు లేవు. కావున నీవీ విషయంబున మిన్నకయుండుము. గృహమునకు వెడలుము.

శాంత—ప్రాణపతీ! క్రొన్ననవిలుకానిఁ బోలుసందము గలిగిన చిన్నచిఱుతపై నింతటి క్రౌర్యము వహించిన గతియేమి? గోరువెచ్చని నీటికి సహింపనివీని మృదుతరాంగము, చలచలమసి క్రాగునూనెలో మునుఁగసైఁచునా? నాథా వలదీకఠిన దండన.

సీ॥ చెఱఁగొడ్డివేఁడెదఁ దరుణీమొలిన్వని కరుణార్ద్రదృష్టినిఁ గనవె సుతుని.
నీపాదకంజముల్ నిరతముధ్యానింతు, ననురాగమునఁగాంచి మనుపు సుతుని.
మతిపదధ్యానైక పరతమించిననీదు కోడలినైదయఁ గొనుము, రమణ.
ముదమునఁ బెఱిఁగిన ముదసలి నగుననుఁ జూచియైనఁ బ్రీతి, మానుగనుమ.

గీ॥ ఏమిరయెఱుఁగనీముద్దుల రయెమ్మెకాని,
చెలువులకునెల్ల నిలువగు చెలువుకాని
నీతివిధులకునెలవగు నీటుకాని
జంపకేలకో, వదలుమా, చలముమాని.

నాథా! నినుఁబతిమాలికొని వేఁడికొనియెద, నాకీ. పుత్రప్రా
దానంబిమ్ము.

హంస—నాతీ! నీవీరీతి పుత్రమోహమున వాపోవుట నిరర్థకము ధర్మ
థులచేఁ గట్టఁబడిన నేను నాసూను విషయమున మాత్రమావిథుల
వ్యతిక్రమంబుగ నడవఁజాలను. నీప్రార్థన వ్యర్థమగును గావున నీవి
మందిరంబునకు వెడలుము.

శాంత—(హాయని నిట్టూర్పువిడుచుచు దుఃఖించుచుండును.)

సుధన్వ—తల్లీ! ఏమి యీదుఃఖము? ఏమి యీ యజ్ఞానము? ఏ
యింతటి వ్యామోహ వారిధిలో మునిఁగితివి? నారదులచే మున్ను
నీవినిన బ్రహ్మజ్ఞానోపన్యాసఫల మీరీతిఁబరిణమించెనా? ఈపతి
సతి, సుతులెవరు? క్షితిలోఁ గారణాంతరమునఁ గలిగిన యీబాం
వ్యము సతమా? సారములేని సంసారములోఁజిక్కి విమోహపాశ
ములఁ గట్టంబడి, వియోగమున దుఃఖించుచు, నిత్యవస్తువును ధ్యాని
పక యుంట నెవరొనరింపఁ దగినపని? అధ్యాత్మతత్వసారంబగ
నిత్యవస్తువును నమ్మక, మాయా ప్రపంచంబున మునిఁగి యెద్దియు
నేను, నాదియనెడి యహంకార మమకారములలోఁ జిక్కి విషయ
ద్యనుభవములసాక్కి యధ్యాత్మసారమునకు విపరీతార్థంబు గల్పిం
భ్రమింపఁజేయు నాస్తికులరీతి, నీవు నటించుట కేవల విస్మయావహ
ముగ నున్నది. నీసుతుఁడగు నేను నీనుండి పాసిపోయెదనేయను చిం

గదా నినుబాధించుచున్నది. నీకుఁగల నాసుతత్వమునకు నా దేహము కారణమా? ననుఁబొందియుండు నాత్మకారణమా? నీకుఁగల దేహతత్వార్థ విద్యాప్రభావంబున దీనినిఁ గనిపెట్టుము. నెమ్మదిగనుండుము. (తండ్రినిఁ జూచి) నాయనా! నీయానతి ధర్మశాస్త్రానుమతి ననుసరించినది. నీయాజ్ఞ కఠినతమమగుక్రూరంబని, విద్యావిహీనులందురుగాని, యించుక తెలివిగలవారనరు. సమస్త జనులను ధర్మవిధులను చక్షువులచేఁ గనుచుండు రాజు దేవాంశ సంభూతుఁడని పేర్కొందురు. అటు కాఁడేని రౌరవాది నరకంబుల బాధపడును. నీనుండి వెడలిన యాజ్ఞ శ్రీహరి యాజ్ఞయని నేఁదలంచి సుఖముగ నానందమయుఁడగు శ్రీహరి చరణ కమల సేవకై పోయెద. సెలవిమ్ము. (భటులనుఁజూచి) భటులారా! మీపతి యానతి నతిత్వరితగతి నలుపుఁడి. ఆలస్యము వలదు. రండిపోవుదము.

(సుధన్వుఁడు భటులునిష్క్రమింతురు.)

ంస—హా! హా! ఇంతటి ధీరుని, శ్రీహరి ధ్యానైకపరుని, కొమారుని, క్రూరదండనకు గుఱిచేసి నే నీ ధరనున్న నేమిప్రయోజనము? మరల నొకతూరి యాకొమారుని మోముఁ గన్నులారఁ జూచివచ్చెద.

(నిష్క్రమును.)

చతుర్థరంగము.

భటులు, సుధన్వుఁడు, శాంతమతి, హంసధ్వజుఁడు, శంఖలిఖితులు.

[అనుబంధము 8.]

సు—(తల్లినిఁజూచి) తల్లీ! మరల నీవేల యిచ్చటికి వచ్చితివి? శ్రీహరి దివ్య విగ్రహమును నామనోంబుజ పీఠమున స్థాపించి, తత్సేవాపరత్వ

మున మైమఱచి బాహ్యప్రపంచం బెద్దియుఁగానక యుండెద. నీవి
చింతించుచు నాయెదుట నిలిచితివేని నాకు మనోనిగ్రహంబురా
కావున వెడలిపొమ్ము. వేఁడికొనియెద.

శాంతమతి—నాయనా! వెడలిపొమ్మని నీవాడుదువుగాని నిన్ను వ
యొకయడుగైనను నిడ నాకు మనంబు రాకయున్నది. ఏమిసేయు
సుధ—తల్లీ! ఈ వ్యామోహమునుండి ప్రయోజనంబు లేదు. ఆలస్య
వలదు. పోయిరమ్ము. నీపాదములపైఁ బడి వేఁడికొనియెద.

(అనుచు నమస్కరించును.)

శాంత:— సీ॥ పతిపదధ్యానైక పరతమించితివేనిఁ దప్తతైలము శాంతిఁ దనరుఁ గాత
శ్రీపతినే సదా సేవింతు నేనియుఁ దప్తతైలము శాంతిఁ దనరుఁ గాత
కలనైన నొకపాప కార్యముఁ జేయనేని దప్తతైలము శాంతిఁ దనరుఁ
పరులను నొప్పించు పనిసేయనేనియుఁ దప్తతైలము శాంతిఁ దనరుఁ గా

గీ॥ అత్తమామల కనురక్తనైతినేని
దప్తతైలంబు శాంతినిఁ దనరుఁ గాత
ధర్మమార్గంబుఁ దప్పనిదాననేని
దప్తతైలంబు శాంతినిఁ దనరుఁ గాత.

తనయా! శ్రీహరిని ధ్యానించుచు నీ తండ్రియాజ్ఞాబద్ధుఁడవు గ
హా! హా! శ్రీహరీ ఈ లోకైక విఖ్యాతుని, ఈ యభిమానశా
ఈ హరి సేవాయత్త చిత్తుని, ఈ సుందర సుకుమారుని, ఈ మా
తృసేవా ధురంధరుని, ఈ సకల సజ్జన సఖుని, ఈ నీతికోవి
ఈ సదాచారసంపన్నుని, నీచరణ కమలారాధనాపరునిగఁ జేసి
సుఖముగాఁ బోషింపుము. (అనుచు వందనంబిడి సుతునిఁ గౌఁ
-చుకొని) నాయనా! నీ మోము ముచ్చట యీ లోకమునఁ జ

భాగ్యము నాకింతటినుండి లేదాయెఁగా? నాకిదియే తుదియాయెఁగా? (అనుచుఁగ్రిందఁబడును.)

సుధన్వు—(తండ్రికివందనంబిడి) నాయనా! నేనెన్నఁడునుఁ గాని ధర్మ మార్గంబు వదలి నడచినవాఁడనుగాను. నీయాజ్ఞశిరసావహించి తప్త తైలమున మునుఁగ నేభయపడను. వీరక్షత్రియుఁడనై క్షాత్రవవీరుల సంగ్రామమున జయించి వీరస్వర్గము నందక యీదుర్మరణంబునకు గుఱియైతినే యను భయము నన్నంటినది. అయినను సకలదురిత భయాపహారకుఁడగు శ్రీహరినిఁ బ్రార్థించి నీయాజ్ఞ నెఱవేర్చెద. (అనుచు శ్రీహరికిఁ గేల్మోగిచి.)

సీ॥ కావఁడే ప్రహ్లాదుఁ గంబంబునన్బుట్టి ఘోరహిరణ్యకు గుండెఁజీల్చి
ప్రోవఁడే బాలుర ధూరిమృత్యువునాఁచి యర్జును శపథంబు నరయఁజూచి.
ఇయ్యఁడే గురువర్థ మిమ్మని వేఁడిన నృపసుతు జీవోప యుతునిఁ జేసి
కట్టఁడే సాంబ్రాజ్య పట్టంబు ధ్రువునకుఁ దండ్రిపరిభవింపఁ దడయక పుడు.

గీ॥ అప్రమేయుఁడనుపముఁడనవద్యుఁ డచ్యుతుండు
నాదిమధ్యాంత రహితుండు నఖిలలోక
పాలకుండును గరుణాల వాలుఁడలఘుఁ
డొక్కభక్తునిఁ బ్రోవఁడే మొక్కులండి.

[ అనుచుఁ తైలకటాంజనము సరసంజేరి. ]

మ॥ జయనారాయణపద్మనాభ హరి యోసారంగరక్షాచణా
జయగోవింద, రమాపతీ, మురహరా, సర్వరూపోత్కరా
జయపీతాంబర వాసుదేవ, నృహరీ స్వామీ, నిన్నే వేఁడెదన్
దయనీదివ్య శరీరమున్గనఁగ డెందంబందునన్ గోరెదన్.

(అనుచుఁ తైలమున దుముకును. అందఱు హా హా కారములతో తెచ్చువడి నిలిచియుండ, సుధన్వుఁడు లేచి.)

(రగడ.)

జయజయకృష్ణా, జయరోచిష్ణా, జయజయరక్షోకుల, శోషిష్ణా
జయజయజిష్ణూ, జయభ్రాజిష్ణూ, జయతాపసహృత్కవనవర్ధిష్ణూ
జయజయశౌరీ, జయదైత్యారీ, జయజయసురసంకట పరిహారీ
జయసుకుమారీ, జయగుణహారీ, జయజయత్రిభువన బహుసంచారీ
జయవనమాలీ, జయసుకశూలీ, జయజయవనజాలయ హృత్కేళీ
జయఘనకేలీ, జయనయశాలీ, జయజయదానవ గర్వోన్మూలీ
జయసురనేతా, జయవిఖ్యాతా, జయజయలోకత్రయ నిర్మాతా
జయజయత్రాతా, జయవిజ్ఞాతా, జయభవభయహర లోకాతీతా
జయదామోదర, జయలోకోదర, జయజయదరకర, దరభీకరకర
జయజయశ్రీధర, జయసురశ్రీకర, జయజయమునిజన మానసమందిర
జయనారాయణ, జయనతపోషణ, జయజయసురవర హృత్పరితోషణ
జయ, రిపుభీషణ, జయరుచిభాషణ, జయజయవాదాగమ పరిభూషణ
నతులనుతులనే నతిశయనయమతి, గతినీవేయని కరుణను వేడితి
గతిఁగానని నను గానవె శ్రీపతి, యతులితముగు నీయడుగుల వ్రాలితి
సురవరవరదా, సోలితిదయఁగను, శుభములనొసఁగుము స్రుక్కించకనను
పరమపురుష నా భావమునన్నిను పరిపరివిధముల నే భావింతును.

(అనుచుహరిస్తుతిఁ జేయుచుండ, దేవతలు పుష్పవర్షముగురిపింతురు. దానినిజూచి జనులు సంతోషముగఁ గరతాళధ్వను లొసర్తురు.)

శంఖ—(హంసధ్వజునిఁజూచి) భూమిపాలా నీ బాలుఁడు శ్రీహరిభక్తులలో నగ్రగణ్యుఁడుకావున నేనైహికదండన వానికంటదు. ఈ నీకొమారు నకు సేనాధిపత్యమునిచ్చిరణమొసర్పినచో నీ చిరకాలాపేక్షితుఁడగు శ్రీపతి నీకుదర్శనమిచ్చును.

హంస—బ్రాహ్మణోత్తమా; తమయానతి శిరసావహించి యొనర్చెద రణకోలాహలధ్వని యపుడే వినఁబడుచున్నది. ఆలస్యమేల పోవుదము.

(నిష్క్రమము.)

# పంచమ రంగము.



## యుద్ధభూమి.

---

(అర్జునుఁడు—వృషకేతుఁడు—సుధన్వుఁడు—హంసధ్వజుఁడు.)

వృషకేతు— అనుబంధము 9.

నాయనా! నేనుండజగదేక వీరుఁడవనివిఖ్యాతినందిన నీవేల యీవీరునెదిరింపవలెను? నేనేమిచేతకానివాఁడనా?

అర్జు—బాలకా వృషకేతూ? ధైర్యశౌర్యపరాక్రమములందు నీవునాకంటెను నేమాత్రముఁ దక్కువకాదు. అయినను నిన్నుఁ గనుఁజెప్పవేయక కాచికొనిరమ్మని నా తల్లియగు కుంతియాజ్ఞయిడినది కావున నిన్ను వలదని నేనేయుద్ధమాడఁ దలంచితినిగాని నీయందు బలహీనతనారోపించికాదు. నీ కురణమొనర్పఁ గుతూహలముండెనేని నీవేప్రారంభమున యుద్ధమునకుఁ బ్రారంభింపుము.

వృషకేతు—అటులొనర్చెద (సుధన్వునిఁజూచి) ఓరీ! యుద్ధమునకు వచ్చి నిలిచితివేల? రమ్ము, లేదానాపెత్తండ్రి క్రతుహయమును వదలుము.

సుధన్వ—ఓరీ బాలకా! నీవర్జునుని కుమారుఁడవా?

వృష—వీరవరా! వీరాధివీరుఁడగు కర్ణుని కొమారుఁడను. వృషకేతువని నానామము. రణమునకు వచ్చి వ్యర్థభాషలేల?

సుధన్వ—ఓరీబాలకా! నినుఁబోలు పసిబాలునితో సంగరమొనర్పనామదికి సమ్మతముగ లేదు. అర్జునునోడింప, నిచటికి వచ్చినాఁడను.

వృష—ఓరీ మూర్ఖా! లోకకర్తయగు, మాహేశ్వరుఁడే ఫల్గును నెదిరిం జయమొందఁజాలక శివపాశుపతంబు నిచ్చెననునది నీవువినవా? యును నీకుఁగండకావరమా? బుద్ధిమాంద్యమా? ఇంటగెలిచిర గెలువుమనురీతి పిల్లవానిని నన్నుగెలిచిన పిదపఁగదా నా పెద్దల బోవలయును. లోకైకవీరుఁడగు పార్థునితో సంగ్రామమొనర్చి ణంబునందె సుధన్వుఁడని పెద్ద పేరుపొందుటకా నీవాఫల్గునుని సంగరంబుఁగోరెదవు? ఓరీ బుద్ధిహీనా! నన్నెదిరించి జయించిన పఁగదా క్రీడితోఁబోరవలెను. ఇదిగోమొదటి బాణప్రయోగము నేకండకావరమెక్కిన నీనాలుకఁ గత్తిరించెద.

అనుబంధము 10.

మత్తకోకిలలు—పోరుఁగోరితివేని నిల్వర, బుద్ధిజాడ్యుఁడ చక్కఁగఁ
ధీరవృత్తినిఁ బూనివాశర, తీవ్రధారకుఁదాళరా

సుధన్వ—నోరుమూయర హెచ్చుమాటల, నోప్పివాలుక కేలరా?
కారుకూఁతలసంగరంబిది, కాదురా, రణమానురా.

వృష—మేరమీఱఁగ మాటలాడకు, మేనుఁద్రుళ్లఁగఁజేతురా?
ఘోరనారసమిద్దిరాయిది, కోరునీరుధిరంబురా?

సుధ—పోరపోరక మందిరంబునఁ, బాలపాన్పుననుండరా
వీరులంబలె, మాటలాడుట, విక్రమంబగునేమిరా.

(అనుచునొకరిపైనొకరు బాణములువేసి యాబాణములను న నేద్రుంచివేసి)

వృష—ఓరీ సుధన్వా! నీతలిదండ్రుల పుణ్యవశముననో, దైవానుగ్ర ముననో, నా బాణంబు వ్యర్థమయ్యెను. అమోఘమగు మఱియొ

క్రూరబాణం బీనూరిఁ బ్రయోగించెద దానినెట్లు తప్పించుకొందువో చూచెద.

...ధ—ఓరీ! పొట్టక్రొవ్విన బాలకా; గురుముఖమున రెండు మూఁడు బాణప్రయోగములు నేర్చియెన్నిమాట లాడెదవు? ఇదిచూడ నీగురువులు నీకుమాటలు నేర్పినారుగాని శరప్రయోగము నేర్పరైరని తెలిసెదను.

వృష—ఓరీ! హెచ్చుమాట లాడినా గురువుల నిందింపకు. నీ జిహ్వఁ గత్తిరించెద.

మాలిని వృత్తము.

ధీరునిఁ బోలుచుధిక్కృతిమాటల, దీకొనియార్వఁగ నేల యిఁకన్
పోరుననిల్వర పొందుగ నీదగు, పోణిమి నార్చెద, నీవుగనన్

...వ్య:—చేరరనీగురుఁ జెంతకువెళ్లర, చేదగుయుద్ధమునీకునిఁకన్
వారకయుద్ధను అనుచు బాణములువేసి వృద్ధలదుగురు·
వాడిమిఁగాంచెద వాసియుఁగూల్చెద యుద్ధమునన్.

వృష—కమల విలచిత వృత్తము.

పదరకు పదరకు, పదునగు బాణము
యిదెకను యసువుల నిలఁబడవేయును
కుదురుగ నిలువను కుధరమునన్ బలె
బెదరకు మదరకు పిఱికిగఁబాలకు.

...ధ—కుసుమ విచిత్ర వృత్తము.

అదురుచె ఘోరం,దరిగుమిఁ గాంచన్
బెదరుదు వేసీ, చెడిదవు మాటన్
చదురుగఁబోరన్, జడియకనిల్వన్
కదనమునందున్, గలఁచెదనిన్నున్

(అనుచు బాణములు వేయఁగవి వ్యర్థమగును.)

వృష:—పోటుమానిసియౌం బోలెన్
మాటలాడకురా, పోరా
యీఁటెపోటగురా, పోరన్
చేటుదెచ్చునురా, నీకున్

నూతన వృత్తము.

సుధ:—సాటిలేనిదిరా, యీనా
యీఁటెవాడిమినిన్ జేరున్
మాటలేలయిఁకన్ బోరన్
గీటడంచునురా, నినున్

మదన విలసిత వృత్తము.

పదరకు పిఱికీ
కదనము పనునీ

వృష:—హృదయముఁ గలఁచున్
యిదెగను శరమున్

సుధ—సరలితా వృత్తము.

పదునగు బాణం
విడెగను, ప్రాణం
బదరంగ నిన్నున్
చెదరంగఁ గొట్టున్

(ఈ బాణమునవ వృషకేతు మూర్ఛపడును. అర్జునుఁడు వానింజూ
ముందఱికి వచ్చి)

అర్జునుఁడు—(సుధన్వునిఁ జూచి) ఓరీ! భీష్మకర్ణాదులను జయించి
యుండని ప్రఖ్యాతిసందిననాతో యుద్ధమొనర్ప నీవుసాహసించెద
నీ ధైర్యమునే మెచ్చితి.

సుధ—అర్జునా! కుత్సితకవులమాడ్కి నీ పరాక్రమము నీవే పొగడికొనుచు వాచాలత్వముఁ జూపిననేమి ప్రయోజనము? శ్రీకృష్ణుని సారథ్యసాహాయ్యము నీకు లేకయుండినచో నీ వెన్నిదినములకు ముందో యమునింటి యతిథివగుచుంటివి. ఇదియెవరికిఁ దెలియనివిషయము? చెప్పికొనిన నగుబాటగునని యెంచక సిగ్గుమాలి భారతయుద్ధము నందలి నీ పరాక్రమము బొగడుకొని యెదవే? స్తుతులపై నీ కంతటియపేక్షయుండినచో మాసవేతనము లిచ్చి బట్రాజులను నియమించి దేశదేశములకుఁ బంపరాదా?

అర్జు—(కోపమున) ఓరీ శిశుమూర్ఖా: నిన్నపుట్టినేఁడు కన్నుదెఱచి యేయుద్ధమునుఁ గనులారఁ జూచియెఱుంగని నీ వానాపరాక్రమము నందియించుపది?

సుధ—అర్జునా! అలరనిపుష్పము పత్రములమఱుగునడాఁగియున్నను వాయువశంబున వెలికిగపడి తనపరిమళము దశదిశలవ్యాపింపఁజేసిన విధంబుననే నిదివఱకుఁ బెద్దలమఱుగునడాఁగియున్నను నిపుడుయుద్ధప్రసక్తికలిగినదికావున నాపరాక్రమము వెల్లడింపఁజేసెద. ఇదిగో నాశరనైపుణ్యంబుఁజూపెద. యుద్ధమునకు సిద్ధుఁడవుగమ్ము. నీ దివ్యాస్త్రముల మహిమముఁజూపుము.

అర్జు—ఓరీ పొగరుబోతా కండకావరమునఁగాను కూఁతలుగూయుచు. ప్రుడి పెనుపీరుచల్లిన నడఁగుభూళికి వర్షాకాలజలధరంబులు కావలయునా? చెప్పవేసినఁ బాఱుదోమల నడంప సుపర్ణునిసాహాయ్యంబుగావలయునా? నినుబోలుబాలునిఁ బిలుకుమార్పనాది వ్యాస్త్రములుగావలయునా? వెడఁగుమాటలుచాలిఁక. వీరునకుమిడిసిపాటుతగదు.

సుధ—అర్జునా: శ్రీకృష్ణుని సాన్నిధ్యమపేక్షింపక నీవు సంగరంబొనర్తువేని నీప్రాణములు నిలువవని తెలియుము, ఇదిగో నాశాతశరంబు గొంపితి. దీనినెటుతప్పించుకొందు వో పరీక్షించెద.

అనుబంధము 11.

పంచ చామరము—అరాతిజీవమారుతమ్ము సానుసర్ప మీశర
మ్మురమ్ముఁగ్రుచ్చి నేలఁగూల్చు, యోధవీరవారముల్

అర్జు—సరీసృపాశుగంబుఁజీల్చు, సారవీరశస్త్రమీ
ప్రరూఢబాణధారకీవు ప్రాణమప్పగింపుమా.

ఓరీ: నీసర్పబాణంబును నాగారుడబాణంబునఁ నడఁచితి. చూచితివియా.

సుధ:—ఓరీ: అర్జునా: నిక్కమాటలాడకు. నీ వేపరాక్రమ వంతుడవని సాక్ష్యము. దాడితన్నువాని దలదన్నువాఁడుండును. పోరుమానిమందిరముఁజేరుము.

సుగంధి వృత్తము—పోరుమానిపోరహీన, పొంగినీవునిల్చినన్
క్రూరబాణపాతమేసి, కూల్తునిన్ను మేదినిన్

అర్జు—నోరుకుళ్లమాటలేల, నోవ్వకీవు నిల్వరా
శూరధర్మమార్గణంపు, సూటినీకుఁజూపెదన్

ఓరీ: సుధన్వా: ధీరునిబలెమాటలపోటుఁజూపకు. అదిశూరులధర్మముకాదు. నీవుయువతులఁగూడి యసంగసంగరంబున కర్హుఁడవుగాని, యోధవరులఁ జేరికఠినశరములకోర్చి సంగర మొనర్పనమర్థుఁడవుకావు.

సుధ—ఓరీ: సవ్యసాచీ: రణరంగమువదలిపోవనే నేమి రమణినా? పౌరుషముఁగలశూరుఁడు నారీవేషమునుఁ బూని యంతఃపురంబున నడఁగి

యుంచువా? నీకుఁగలయీ యలవాటు నాకులేదు. బుద్ధిలేనిమాట లాడకు.

మ. బుద్ధిజాడ్యతఁ మాటలాడకు పొమ్మయింటికివేగ యీ
యుద్ధరంగము వీడిబాలక యుల్లసంబు పల్కులర

అర్జు—ఉద్ధతోరు పరాక్రమా న్వితుఁ డుక్కుఁ డక్కునెయ యెయ్యెడర
క్రుద్ధుఁడైయిటు మాటలాడఁగఁ గోరునే బలశాలి తార

ఓరీ: బాలకా: నీ విటులక్రొవ్వుమాటలాడకు. నీ పొగరడంచు బాణం బుప్రయోగించి నీ పొడవడంగఁజేసెద: ఇదిగో చక్కఁగఁజూడుమీ బాణధారను.

సుధ—ఓరీ: ఫల్గునా: క్షీరసాగరభట్లనురీతి నీకు విజయనామంబు గలదని గర్వింపకు.

మాళవ వృత్తము—విజయుఁడనునీ, బిరుదుఁజెలిచకర
నిజముగనుమీ, నిశితశరముర

అర్జునుఁడు—కుజనులకుఁజే, కురునుమరణం
బజహారులువ, ద్దనిఁగనుమా

ఓరీ: సుధన్వా: ఈ నానిశితబాణంబున నీకుమరణంబుసిద్ధంబు. ఏలయూ రకప్రాణంబుఁ గోల్పోయెదవు. అధ్వరాశ్వము నాయకీనపరచిశరణని పాహిమనుఁగాపాడుకొనుము.

సుధ—ఏమీ: అర్జునా: ఏమి ప్రల్లదంపుఁబలుకులు పలికెదవు? పట్టినహ యమువదలుదునా? పట్టభద్రుఁడయిన నాతండ్రియీహయంబునహయ మేధంబొనర్ప సమకట్టినాఁడు. నీయగ్రజుండగు ధర్మరాజు సాంగోపాంగ ముగ నశ్వమేధమొనర్ప నీవుదలంతువేని భారతరణంబున నీకు జయం

బాజ్ఞెంచియిచ్చిన శ్రీహరిని నీసాన్నిధ్యమందుంచుకొనియుద్ధమొనర్పుము ఆదైవంబు నీసన్నిధిలో లేనిచోనినుఁ బోలుసహస్రార్జునులనైనను నేసరకుసేయను. హెచ్చరిక.

అర్జు—ఓరీమూర్ఖా: ఒకరిసాహాయ్యముపై నాధారపడిన పరాక్రమంబది యెంత? నినుఁబోలుదోమను విదిలింపఁ బ్రళయానిలముగావలయునా? నినుఁజంపకవదలిన కారణంబునఁగదా నీక్రొవ్వుహెచ్చెను. ఇదిగో యీశరమున నీశిరముఁదఱిగెద.

ప్రహరణ కలిత—తడయక యిపుడే, తఱగెడు శిరముల్
పడిఁజనుఁగనుమా, పదునగు శరముల్

సుధ—తడయక శరముల్, దఱిగితిఁ జనుమా
కడకవిడువుమా, ఘనతను గనుమా

ఓరీ యర్జునా: నా పనియంతయు నీశరములఁద్రుంప సరిపోయెను. ఇఁకనీశిరముఁ ద్రుంపఁబ్రయత్నించెద.

మాణవక వృత్తము—పాశుపతాస్త్రంబిదిగో
నీ శిరముల్ ద్రుంచునడీ
ఈ ఘనకుల్ వ్రేకుమవే
నా శరణంబుల్ గనుమా.

(అనుచుశరము వేయనర్జునుఁడు దూరమునకుఁ గొట్టికొనిపోయినేలఁ బడును. సుధన్వుఁడు సంతసంబునమఱుఁగున నిలిచియుండును. అర్జునుఁడు మూర్ఛఁదెలిసిలేచి.)

అర్జు—ఏమియచ్చెరువిది. పసితనమున నేద్రోణాచార్యుల సరసశుశ్రూషనలిపిశస్త్రాస్త్ర విద్యసంపూర్ణముగఁ గఱచితి. ఆవిద్యయెల్ల నీ యోధ

వరునియెడనమ్మయ్యెను. కాలకేయాద్యసుర వరుల యసువుల వెసనా ర్చిన నాశరవార మీకుమారుని శరీరమంటదాయెను. కిరాతరూపంబున వచ్చిన యీశ్వరుని భుజబలంబున మెప్పించిన నా సత్వమీబాలునియందు నీరాయెను. ఖాండవదహనమున సురవరుని జలధారలణంచిన నా, నారాచపరంపర, యీరాచపట్టియందు బూడిదెలో హోమమురీతి ఫలింపదాయెను. ఉత్తరగోగ్రహణకాలంబున భీష్మద్రోణ కర్ణకృపాశ్వత్థామాది యోధవరులయుక్కుఁ జెఱచి స్తంభింపఁ జేసిన నాసమ్మోహనాస్త్ర సామర్థ్యమీకుమారుని బాధింపదాయెను. భారతరణంబున భీష్మకర్ణాదులపై ఫలకారిగనుపయుక్తమయిననాశస్త్రాస్త్రములెవ్వియు నీయోధవరుని నంటవాయెను. ప్రారంభముననే శ్రీహరిని నీ సాహాయ్యముగఁ బిలిపించుకొమ్మని యీబాలుఁడునాకు హితముపదేశించెను. దానిని నే నరకుసేయనైతిని. ఫలమనుభవించితి. శ్రీకృష్ణ సారథ్యసాహాయ్యములేనిది నే నేమియుఁ జేయనోపనని యిపుడుగదా తెలిసితి. ఇపుడేమాయెను. ఆరమాపతిని ధ్యానించెద.

క॥ అరిదరకర, యరిదరకర
ఖరమురనరకాదిదనుజ, కంఠకుఠారా
సురవర శుభకర, కరుణా
కర, కృష్ణా, వాసుదేవ కనుమా కనుమా

(శ్రీహరి సాక్షాత్కరించి నిలిచి.)

శ్రీహరి—అర్జునా: నన్నేల దలఁచితివి? నీకేయాపదయిపుడు తటస్థించెను?

అర్జు—స్వామీ: సుధన్వుఁడను యోధవరుఁడు నాసేనసంతయు నోడించి ప్రద్యుమ్నాది వీరులజయించి నన్నునరకుఁగొనక నాపై రిపుశరంబులు సారించిదూరంబునకుఁ బడవైచెను. సొమ్మసిలియూవిరిఁదెచ్చుకొని నీ నామధ్యానంబుసలిపితి.

శ్రీహరి—ఏమీ: ఏమీ: భీష్మద్రోణకర్ణాది వీరులఁజంపినట్టి నినుఁబోలు పరాక్రమవంతునిఁ బసిబాలుఁడోడించెనా? భారతరణాంతమున నిలిచిన రాజులనేకులుహరిభక్తులుగావుననీవు జాగరూకత నుండుమని ప్రారంభమునసే నీకు నేను హితోపదేశంబొనర్చితి. దానినినీవు సరకుసేయక గర్వపడితివి. ఇపుడేమాయెను మరలనీవు వానితో • యుద్ధమునకుఁ దొడరుము.

అర్జు—మహానుభావా: నీవు నిరతమునాసరసనిలిచి సాహాయ్యపడితివేని వానివిజెన కెద. కాదేని నీసమ్ముఖమున నేపడి ప్రాయోపవేశ మొనర్చెద.

శ్రీహరి—అర్జునా: వెఱవకు. నీ వెంబడినేనుండెద.

సుధ—(శ్రీహరినిఁ జూచియూనందార్ణవమున మునింగి మానసి కాభివందనం బమర్చును.)

శ్రీహరీ: రమాపతీ! అనాథరక్షకా: ఆపద్బాంధవా; నీదివ్యవిగ్రహంబు గనులారంగని ధన్యుఁడనైతిని; ఇఁకనాకీయిల వలయున దేమియు లేదు. అయినను నా వైరికి నీవుసాహాయ్యపడితివి కావున నీ యిష్టార్థంబు నెదిరింపనేసమర్థుఁడనుకాను. నీ దయమఱవకు.

(అర్జుననింజూచి) శ్రీహరిసాహాయ్య రహితుఁడవై నీవెద్దియునుజేయఁజాలవని ప్రారంభముననేనీకు నేబోధించితి. సామమున నా బోధన సరకుసేయవైతివి. దండితుఁడవై వింటివి. ఇపుడుమరల నా తో యుద్ధ మొనర్ప సమకట్టితివేని ప్రతిజ్ఞాపూర్వక రణమొనర్పుము. నేనును నీ బలె శపథ మొనర్చెద.

అర్జు—(కోపమున) పలుకుములుకులననుఁ జెనకకుము. నా యొనరించు ప్రతిజ్ఞ వినుము. సిన్ను.

గీ॥ శాతశరముల మూఁడిటఁ జంపనేని
నాగ్రువంశజు లెల్లరు నరకగతినిఁ
బొందుదురు పుణ్యహీనుల చందమూని
వినర; యికనీదు శపథంబు వినఁగవలతు.

సుధ—ఓరీ: అర్జునా: శ్రీహరి చరణాంబుజముల మనోవీథిని నుంచినేఁ జేయుశపథంబును వినుము.

గీ॥ నీశరత్రయంబు నీఱుఁజేయకయున్న
భూసురాళిఁ జంపుపుణ్యహీను
గతినినందుదేను కంజాక్షుప్రోలనా
పంతమిదియువినుమ పాండుతనయ.

శ్రీకృష్ణుఁడు—(అర్జునునిముందటికిఁ బిలిచికొనివచ్చి) ఏమియర్జునా: ముందు వెనుకల నాలోచింపక సరసనున్న నన్నెననుగక నీవింతటికతన, శపథంబొనర్పనగునా నిన్నెదిరించు యోధవరుఁడెవడనుకొంటివి? నాభక్తులలో నగ్రగణ్యుఁడొకటియేగాక యేకపత్నీవ్రతుఁడు. శస్త్రాస్త్రనైపుణ్యము నీకంటె హెచ్చుగఁ గలవాఁడు. ఇపుడేమిసేయఁగలవు?

అర్జు—కృష్ణా! నీ యేస్త్రైరసమ్మికదా నేనింతటి శపథంబొనర్చితి. నీ సాహాయ్యసంపద నాకుఁగలదనిగదా నే గర్వించితి?. నీ కారుణ్యాతిశయంబు పాండవులపైఁ గలదనికదా ధర్మరాజీయశ్వమేధయాగంబొనర్ప సమకట్టెను? ఇట్టికాలంబున నీవు నన్నీరీతినిరుత్సాహునిఁ జేసినచో నాగతియేమి?

శ్రీకృ—అర్జునా! భయపడకు. నినునేవదలను. ప్రారంభమున నే గోవ
నగిరినెత్తి గోపాలురఁగాపాడిన నా పుణ్యఫలంబు నీశరము నందారో
పించి ప్రయోగింపుము.

అర్జు—బావా! అటులనేయొనరించెద (సుధన్వునిఁ జూచి) ఓరీ! శూ
వరా! ఈ నాబాణమున నీ కుత్తుకఁ దఱిగెదఁ జూడుము.

ఉ॥ హరిశరంబిది నీవుగనరా! యర్జునుడుమఁగ వచ్చెదుక్
శరణటంచును, వేఁడరా! సత్వహీనతఁ జెచ్చెరన్

సుధ—దురమునందున నీదుశరముల్ దున్మినైచితిఁ జూడరా
శరమువేలొక టందుమిఁక నీశక్తిఁ జూచెద ఫల్గునా.

ఓరీ! నీ శరధారనుదారియందే నేదునిమితి! దీనినుండి మొదటి శప
భాగము రిత్తపోయెను. ఇఁకనేదీ నీ రెండవశరమందుము.

అర్జునుఁడు—(కోపమున రెండవ శరమందును)

శ్రీకృష్ణుఁడు—అర్జునా! త్వరపడకుము ఈ తూణినీ శరమునందు నాభ
ధారరక్షణ ఫలంబారోపింపుము. (అర్జునుఁ డటులొనరించి సు
న్వునిఁ గని)

అర్జునుఁడు—ఓరీ సుధన్వా! ఇదిగో నా రెండవ శరము దానిఁదుంచి
గనుము.

వీరవృత్తము—శాతశరమిది శరణనుమా
నీ శిర మెచ్చునే నిలువఁగనుక్

(అని బాణము వేయును)

సుధ—కూఁతలనుడిడి కుదురుగ నీ?
శాతశరమునఁ, చనెడిత్రై.

ఓరీ! ఫల్గునా! నీ రెండవ శరంబు సైతము రిత్తపోయెను. ఏదీ నీతుది శపథసారంబు దాని రుచి నించుక చూచెద.

అర్జునుఁడు—(శ్రీకృష్ణునిఁ జూచి) మహానుభావా! ఈ యోధవరునెడ నా సత్వంబడంగిపోయెను. నా గర్వభంగంబునకునై నీ వింతటి కార్యంబు తటస్థింపఁ జేసితివని నే నమ్మెద. శ్రీకృష్ణుఁడు పాండవ పక్షపాతియను నామంబు, నేఁటికి సార్థకంబయ్యెను. కానిమ్ము! శపథమూనినరీతిగ మూఁడవశరంబు ప్రయోగించి యదియు రిత్తపోయెనేని నే నగ్నిప్రవేశ మొనర్చెద.

శ్రీకృష్ణుఁడు—అర్జునా! ఇంతటియాక్రోశము వలదు, నెమ్మదిఁ గనుము. ఈ తూరి నీ శరము మొదటిభాగమున బ్రహ్మతేజంబును దుదిని మాహేశ్వర తేజంబును నావహింపుము. మధ్యభాగమున నా తేజంబు నినిపి వానిని సంహరింతును.

అర్జునుఁడు—(అటులొనరించి సుధన్వునిఁ జూచి) ఓరీ! ఈ తూఁపునిన్ని యిలకుఁ దప్పించెదఁ జూడుము.

తరళ—హరిహరాజ శరంబుఁ బూనితి నాజి నిన్ బడ నైపఁగన్
సురవరాదులకైన శక్యమె, చూడుమా, వితఁజేయఁగన్
నిరతమోక్ష పదంబు నీకగు నీరజాక్షునిఁ గాంచుమా
ధరనుయోధుల వర్గమందు నుదారకీర్తినిఁ బొందుమా.

(అనుచు శరమువేయ సుధన్వుఁడు దూరమునకుఁ గొట్టికొని పోవఁ బ్రాణంబు శ్రీహరితేజంబునకైక్య మగును)

శ్రీకృష్ణుఁడు—అర్జునా! కంటివియా యీ యోధవరుని దైవోపాసన శక్తి. ఏకపత్నీవ్రత మహిమ. శస్త్రాస్త్రప్రావీణ్యము. ఇఁక నీ నూరు

నితండ్రి హంసధ్వజుఁడు పుత్రుని మరణంబువిని క్రుద్ధుఁడై నిన్నుఁ దాఁకును. వానిని జయింప నీవశముగాదు. కావున నీవించుక దూరమ్మున నుండుము. వానియుద్యమంబు నేను వేఱొక విధమున మరల్చెద.

అర్జునుఁడు—బావా! నీయాజ్ఞను శిరమానికంబుగ ధరించెద. (అనుమ వెళ్లును)

(హంసధ్వజుని ప్రవేశము)

శ్రీకృష్ణుఁడు—(హంసధ్వజుని యెదుట నిలిచి) భక్తాగ్రేసరా! నీ చిరకాల కాంక్షిత ఫలమిపుడు గంటివికదా? ఇఁక నీ సంసార లంపట మేల?

హంసధ్వజుఁడు—(శ్రీకృష్ణునకు నమస్కరించి) దండకము—శ్రీమ ద్రమా మానినీ మానసాంభోజమిత్రా! మదోన్మత్తదైతేయ వంశాట వీవీతిహోత్రా, నిరాఘాట నీరంధ్రజీమూత సంఘాత నీకాశతేజో రుగాత్రా! ధరిత్రీకళత్రా! దయాస్నిగ్ధ శోభాయమానోరునేత్రా, పవిత్రా, పునర్జన్మపాథోధి నిర్మగ్న దీనావనాయాసపాత్రా! సువిజ్ఞా నపాత్రా, విహంగేశపత్రా, విమత్తారిజైత్రా, లసద్వల్లవీయావనో ద్యానచైత్రా, సుపర్వేశదుర్వారగర్వోగ్ర సంభూతజీమూత సంఘాత సంత్రిస్త గోవ్రాతకత్రాతరూ పాంచితాంగుష్ఠదే శస్థగాత్రాయశోదా దయాపుత్ర, నీ చిత్రచారిత్రముల్ స్తోత్రముల్ జేయ బ్రహ్మేశ్వరా హీశ దేవానులుల్ జాలరన్నల్ నరుల్ బోలుదీనుండెటుల్ నేర్తునో తండ్రి, నీ దివ్యదేహంబునన్ లీనమైయుండు నీ రేడులోకంబులుల్ గాదె, గాయత్రి నీపాదసూపంబుగాదే, మహాదేవ, వారాన్నిధిన్ యోగనిద్రానుసంధాన మోదంబున న్నీవు నారాయణాకారతన్ దా

ల్చిరాజింపవే; దేవ, మత్స్యమవై వేదముల్ నాగ్గరక్షింపవే, కూర్మమవై కుంభినీ ధ్రంబు మున్నెటిలోఁ దేల్పవే, కోలమవై కుంభినిన్ గాచి హేమనాక్షునిన్ గూల్పవే, నారసింహాకృతిన్ బూని నైతేయునిన్ గూల్చి ప్రహ్లాదునిన్ నిర్భరాహ్లాదునిన్ జేయవే, పొట్టివై యాబలిన్ మెట్టవే, జామదగ్న్యుండవై భూమిపాలాళిసిన్ జంపవే, రాముఁడవై భీమసంగ్రామమందా మహారావణున్ లోకవిద్రావణున్ ముంచవే, దేవ దేవా! ననున్ గావవే, శిష్టరక్షావనా, దుష్టశిక్షావచణా, ఘోరసంసార నీరాకరోత్తారకా, క్రూరసక్తంచరవ్రాతదుర్గర్వనిర్వాపకా, ధర్మ విస్తారకా, సౌఖ్య సంధాయకా, మోక్షలక్ష్మీ మనోనాయకా, గానమోదాత్మకా, దీనసంరక్షకా, కుండలీతల్పకా, భక్తసంకల్పకా, బ్రహ్మరుద్రానిలాదిత్యసంస్తుత్యపాదా సురేశార్థిత శ్రీమహాసంద్రహృన్మోద, నీ పాదముల్ నమ్మితిన్, బ్రోవుమా, మాధవా, మ్రొక్కెదన్ మ్రొక్కెదన్ మ్రొక్కెదన్. (అనుచు వందనం బిడును.)

శ్రీకృ—మరాళధ్వజా! నీ చిత్తశుద్ధికి, భగవదారాధనాసక్తికి నేనెదమెచ్చి కరుణాతరంగితమతిఁ బూని, నీకు దర్శనమిచ్చితి. సకల జీవులకునా మాన్యమగు జనన మరణాది దుఃఖములఁ బడిపోల్లకు, కానులాగతిగఁ గలిగిన పుత్రమరణంబునకు వగవకు. పాండునందనులు నా పంచ ప్రాణములు కావున, వారినిఁ బోషించు భారము నాయది! నీవును బాండవులను జేరి వారి కతూద్యమంబు సమాప్తినొందింపుము. సదాకాలంబు నాసర ననుంచుము. నీ చిన్నకొమారునకు రాజ్యపట్టం బిమ్ము. రమ్ము పోవుదము.

హంస—మహానుభావా! నీ యాజ్ఞాధారకుఁడను నీ పాదసేవకుఁడను.

(నిష్క్రమణము)

## తృతీయాంకము ప్రథమరంగము.

మకీయాశము.

(ప్రమీల—సుశీల—సుచేల—సులీల—వినీల—విలోల—గుణజాల—కమాల—అనలీల—సుకుంతల—సువాల—విశాల—శకుంతల.)

ద ర్బా రు.

అనుబంధము 13. అనుబంధము 14.

ప్రమీల—(సింహాసనముపైఁ గూర్చుండి) యువతీమణులారా! తరతర ముగవచ్చిన మన దేశాచారమునకు విరుద్ధముగ మనము వర్తించినటుల నిన్న రాత్రి, నేను గలఁగంటిని. ఇదియేమియుండును?

సుశీల—అమ్మా! మహారాణీ, అనేకులు యువానులు దారిఁదప్పి మన దేశముఁ జొచ్చిమనవశులై మరువశులై యొకమాసంబు వఱకు మా కేళిని మముఁగూడిపిదపమరణంబుఁ జెందుచుండిరికదా? ఇపుడది యే మికారణమో, యేయువనాథ్యుఁడుమా దేశంబుదిక్కు సంచరింపఁడు

సుచేల—నే నిప్పటికిఁ బదునైదు దినములుగఁబూర్వదిగ్భాగమునుండి మనదేశమెల్లెడ సంచరించివేసరితి. మగవాఁడొకఁడైనను దొరకఁ డాయెను?

సులీల—రాణి! దక్షిణ దిగ్భాగము సంచరించి రూపలావణ్యాతిశయు డగు నొకయువనాథ్యుని బట్టితెచ్చియుంటిని. వాఁడు నాయింటనాఱ సంబులుండి పిదపనశించెను. నెలదినములవఱకు జీవమునుండఁ దగినవారు స్వల్పకాలములోనే మృతులగుటకుఁ గారణంబుఁ జెలియ డాయెను?

నీల— మహారాణీ! ఇప్పుడుమనపురియందుఁ గలయపరిమిత యువతీతతికెల్లనుఁ దగినందఱు పురుషులులేరు. క్రొత్తవారురారు. పాతవారొక్కరొక్కరు ధాతుక్షయమున సన్నగిలుచున్నవారు. ఇటులనే కొన్ని దినంబులు గడచినచో, మగవారిసంపర్కములేక మేమెల్లరము రోగిణులై యుండవలసినకాలము తటస్థించును.

గుణజాల—అటులైనచోఁ గొన్నిదినంబులకు మనదేశము స్త్రీవిహీనమై పోవును. కావునమన మేయుపాయమునైనను, బురుషులను విదేశములనుండి యాకర్షించివారిఁగూడి సుఖంబుననుండ వలయును.

విలోల—మనమారీతిఁ గష్టపడుటకంటెను, లోక స్త్రీలబలెనొకమగ వానినిఁ బెండ్లియాడి వానిఁగూడి సుఖమున నుంటమేలని నాకుఁ దోఁచెను. ఇదిమీకెల్లరకు సమ్మతమా?

తమాల—ఏమి! విలోలా! ఏమిమాటలాడితివి? ఆదినుండివచ్చిన మనమతాచారమును జలిఁగలిపి, నవీనమగు విరుద్ధాచారమును మన మవలంబించినచోఁ జూచినవారునగరా? వినినవారు హేళనము సేయరా?

అవలీల—అంతగాక! స్వేచ్ఛాను సారముగ విచ్చలవిడిగ, మనముండక, స్వాతంత్ర్యమెల్లనువీడి, యొకమగవానికి లొంగివానియానతిలో నుంట ముల్లుఁదీయింపఁ గొఱ్ఱుగొట్టించుకొనిన చందమగునుగదా?

కుంతల—అటుసేసినచో, మనకుఁగలుగు లాభమేమి? మనయందుఁ గల విషసంబంధ రక్తమెటు నశించును. నశింపని యెడల, మనము వివాహమాడిన పురుషుఁడు మనకెటులదక్కును?

సువాల—స్త్రీలేల, పురుషుని వివాహమాడి వానివశం వదలై యబల
రుగ నుండవలెను? స్త్రీలకు మానమర్యాదలులేవా? పరాక్రమము
లేదా? బుద్ధికౌశలములేదా?

విశాల—పరాక్రమమనిన జ్ఞప్తికి వచ్చెను. మున్నుత్రిలోకైక వీరుఁడగు
రావణాసురుని నొక కీటకముగనెంచి బంతులాడినది శ్వేతద్వీపాంగ
నలుగదా? మనమునంతటి పరాక్రమ వంతులముగామా?

శకుంతల—ఆకాశమున సంచరించు పక్షులబలె గాలియాహారము గలిగి
స్వేచ్ఛానుసార ముండక లేనితగులములఁ దగులుకొని వగలొందుట
యపేక్షణీయముకాదు.

ప్రమీల—యువతీమణులారా! బహుకాలాగతాచారనిబంధన నింత
యవలీలఁగ వదలుట సాధ్యముకాదు. కావున స్త్రీవాదంబు మనకి
పుడు వలదు. ఎప్పటివలెగేయ, నృత్య,వేణు, వీణానాదంబుల
బ్రొద్దుఁగడపు చుందము. ఏదీమీనృత్య నైపుణ్యము చూచెద.

అందఱు—చిత్తము.

నృత్యము.

(అనుబంధము 15)

ప్రమీల—నృపకన్యకలారా! మీనృత్య మతివినోదకరముగ నున్నది.
నేఁటికిమన మీ వినోదములు చాలింతము. రేపటిదినమున మనమెల్ల
రము మనయుపవన విహారమునకుఁ బోవుదము. అందఱును సచటి
కిరండు.

(అనుబంధము 16)

# ద్వితీయ రంగము.



వీధి.

(స్త్రీలు. వినీల, విశాల, విశ్వేశ్వరావధాని.)

[అనుబంధము 17]

వినీల—విశాలా! వీఁడేమో శుద్ధవైదిక ఛాందసుఁడుగ నున్నవాఁడు. వీనినిఁ గట్టికొని మనమేమి సుఖంబనుభవింపఁ గలము.

విశాల—వినీలా! ఎట్టివాఁడు వీఁడయినను మగవాఁడుగాదా? మనపురిం గల పురుషులెల్లరు నశిల్లిరి. పురుషాభావమున మనకు సుఖమెద్ది?

విశ్వేశ్వరా—(స్వగతము) వీరేమో నాపాలి మారిదేవతలగ నున్నవారు. వీరినుండి నేఁదప్పించుకొని పోవుమార్గములేదు. (ప్రకాశముగ) యువతీ మణులారా! నన్నేల పట్టుకొని యారీతి బాధించుచున్నవారు? మీ పాదములఁ బట్టికొనియెద. నన్ను వదలుఁడు. నన్నుఁగొనిపోయిన మీకు వచ్చులాభమేమి?

వినీల—లాభమా? నీతోఁబొందు.

విశ్వేశ్వ—అందగత్తెలారా! మిముఁబొంది సుఖంప, నేను వయసువాఁడ నుగాను. నాకిరువురు భార్యలున్నవారు. పదుగురు పుత్రులున్నవారు. నాభార్యలిరువురిపుడు గర్భవతులుగ నుంచుకారణంబున వారికొన్ను న్నకై ధనమార్జింప దేశాటన మొనర్చుచుఁ దెలియక యీదేశంబుఁ జొచ్చితిని.

విశాల—ఏమీ! ఏమీ! నీకు భార్యలిరువురున్నవారా? వారిరువుర
గర్భవతులా? నీవు వయసువాఁడవుకానని వచించితివియే? వయస్సు
లేదేని నీభార్యలు గర్భమెటుధరించిరి? నిన్నుఁగాదని యడ్డదారి
ద్రొక్కి యన్యపురుషునిఁ గూడిరా?

(అనుబంధము 18)

విశ్వేశ్వర—(తలతలఁ గొట్టుకొని) భామినీతిలకములారా! నా భార్యలు
పతివ్రతలు. దుర్మార్గులుకారు. ఏమోదైవానుగ్రహమున గర్భవతు
లయినారు.

వినీల—హా! హా! దైవము సాక్షాత్కరించి నీ భార్యలనుఁ బొంది
నాఁడా? ఇంతటియపద్ధములాడు బ్రాహ్మణుఁడవా నీవు?

విశాల—తనభార్యలబలె మేము రూపలావణ్య వయోవంతులము కామని
యేమో యీ బాపనయ్య మము నిరాకరించు చున్నవాఁడు.

విశ్వేశ్వ—అయ్యో! అటుకాదు! నా భార్యలు కురూపిణులు. మీరంద
గత్తెలు. అయినను నేనన్యస్త్రీ సంభోగముఁ గోరువాఁడను కాను.
అదిపాపమూలము.

వినీల—(నవ్వుచు) ఈ దేశమున స్త్రీసంభోగమునకుఁ బురుషుల కోరిక
యనవశ్యకము. పాపమునకుమూలమగు ననుకారణంబుననే స్త్రీలు పురు
షులను బట్టిభోగింతురు.

విశ్వేశ్వ—అమ్మలారా! నన్నింతటి విషపరీక్షకు గుఱిసేయకుఁడి. మీపా
దములపైఁ బడివేఁడికొనియెద. (అనుచుఁ గ్రిందఁ బడును.)

వినీల—విశాలా! వీఁడు దండసాధ్యుఁడుకాని సామసాధ్యుఁడుకాఁడు
వీని నీడ్చుకొని పోవుదము రమ్ము.

విశ్వేశ్వ—(గట్టిగఁ దనయింటివారినిఁ దలఁచికొని పేర్లు పిలిచి చీలును.)

(అనుబంధము 19)

(నిష్క్రమము)

# తృతీయ రంగము.



## ఉప వనము.

(ప్రమీల, సుశీల, సుచేల, సువాల, సులీల, సుకుంతల, శకుంతల, వినీల, విలోల, విమల, విశాల, తమాల, అపలీల, గుణజాల, కమల, విచికిల, హిమాచల, ఉన్మీల, కోకిల, అర్జునుఁడు, సేన.)

— ర గ డ —

ప్రమీల—మూలమూలల జేలడాఁగెదు ముగుదడాఁగుడు మూతలాటల.
సుశీల—చాలుకలవరఁ గాలుఁద్రిప్పకు చాన నీవికటంపుమాటల.
సుచేల—కేలుకేలునఁ జఱచివాలెదఁ గీరవాణిరో నన్నుగూడుము.
సువాల—బాలతోఁ జలమేలగోలా పాడినాతోఁ బెంథమాడుము.
సులీల—నీలవేణిరో నిన్నుగెలిచెద నీటి యీఁతలవచ్చి చూడుము.
సుకుంతల—కాలమా యిదికలహములకును గలికిరో మన్ననలు వేఁడుము.
శకుంతల—ఇంతిరొంతటివింతలమ్మరో యిట్టిమాటలఁ గలహమగునెటు;
వినీల—కాంత కలహంబులకు మూలము కారుకూఁతల హెచ్చుగాదటు.
విలోల—అమ్మకనవే సౌరభమ్ముల నలరునలరులు గొమ్మకొమ్మకు.
విమల—నిమ్మలనుగొని పోదమటుదా నిమ్మలకునిఁక నమ్మలింపకు.
విశాల—బాలనేలను పాలకిటులటు పండికొనితినుమావి పంటిని.
తమాల—కేలుసాచుచు నందికొమ్మా కీలెఱిఁగి ముక్కంటి పంటెని.
అపలీల—గోఁటఁగిల్లక క్రొవ్వనీవిటు కోమలాంగిరో లేఁతమగువము.
గుణజాల—సాటితెల్పెద వీనినంటవె చానచెల్లెను నీదుగరువము.
కమల—అన్నుమిన్నా! పొన్నపూవులు వందునేమో నిక్కిచూడవె.
విచికిల—సన్నుతాంగిరో నిన్నునెత్తెదఁ జక్కఁగా నవికనుచుఁ గోయవె.

హిమాచల—మేలుమేలిది యెంతతెంపరి మీఁదికొమ్మనుఁ బట్టె వెసఁజని.

ఊర్మిల—చాలుచాలిఁక నవలుఁగొనుపని చల్లఁగాఁ గూర్చుండమటుచని.

కోకిల—అలసగమనరొ యలసితేమే యలరులను గొనివత్తమటుచని.

ప్రమీల—వెలఁది నేనెటు మిమ్ముఁ వదలుచు వెడలనెటులగు నమ్మకనుఁగొని.

(అనుబంధము 20)

సుశీల—అమ్మా ప్రమీలా! ఆరామ విహారమ్మున నలసితివి కాఁబోలు.

ప్రమీల—అగునేసఖి నీకు నలసటలేదా?

సుచేల—సఖీ! విహారానురాగంబున నెంతటి యలసట యైనను లవమాత్రముగఁ దోఁచు చుండును.

శకుంతల—అది నైజమని యీ సనసైతము దెలుపుచున్నది.

కం॥ అనురాగంబున్నయెడ౯
ఘనతలఘిమఁ గాంచు టెచటఁ గననైజంబే
కొనగోఁటి సోఁకునైఁపని
ననయోర్వదే భృంగచరణ నారాచముల౯.

ప్రమీల—శకుంతలా! ఏంతశృంగారవర్ణనయే యిది! అర్థగుంభితమై యెంతటి ధ్వని స్ఫురించుచున్నది.

శకుంతల—అమ్మా! నీవురసికురాలవుగాన నాకుఁదోఁపని యర్థము నీకు శబ్దార్థధ్వనినైపై స్ఫురించినది.

విశాల—అమ్మా! దూరమ్మున నొక గుఱ్ఱము మనయుపవనముఁ జొచ్చినది.

వినీల—అవునమ్మా! ఎంత శృంగారముగ నున్నది.

శకుంతల—అమ్మా! దానిముఖముపై నొకఫలకమున్నది.

సుశీల—అమ్మా ప్రమీలా! ఆఫలకముపై నేమో యక్షరములున్నవి.

ప్రమీల—విశాలా! నీవు పోయి యా హయమును బంధించి దాని నొసటను వ్రేలు ఫలక మిచటికిఁ దెమ్ము.

విశాల—అమ్మా అటులొనరించెద.

(విశాల హయమును బంధించి ఫలకముఁదెచ్చి ప్రమీల చేతికి నిచ్చును. ప్రమీల దానిఁగొని చదివికొని చిఱునగవు నగుచుఁ దల యూఁచును.)

విశాల—అమ్మా ప్రమీలా! చిఱునగవు నగియెదవు. ఆఫలకమునందేమున్నది? చదివిన నేనును విని సంతసించెద.

ప్రమీల—చెలులారా! చదివెదవినుఁడి.

మ॥ యమిలోకావనుఁడైన ధర్మజుఁడు సత్క్రియుతుం, డశ్వమే
ధము సేయన్ దలపెట్టి యీ హయమునన్ దాఁబంపె, దేశాళి, స
ర్వమునన్ గ్రుమ్మరిలంగ దానినెవఁడే న్వారింపఁగాఁ, గ్రీడి, వే
గమే వానిన్ దెగటార్చి తెచ్చును తురంగంబెల్లరున్మెచ్చఁగన్.

వింటిరే! చెలులారా! ధర్మరాజఁట. అశ్వమేధయాగంబు సేయునఁట. ఆయాగాశ్వమిదియఁట, దీనినెవరేనిఁ గట్టినచో వానినిఁ గ్రీడియను వాఁడు చంపునఁట. ఔరాగర్వోక్తులు. చూచెద నొకచేయి! చూపెదనా సాహసము. ఈ క్రీడి సమాచారంబు నేమున్న వినియుంటిని. జడజాతులఁ గూడి సరస క్రీడకు మఱఁగినవాఁడు గాని రణక్రీడకు నోపఁడు. అయినను మనమిటుల నిరాయుధపాణులై నిలుచుట సరికాదు. యుద్ధసన్నద్ధులము కావలయును. (చెలులంజూచి) చెలులారా! మీరీహయమునుఁ గాచికొని భద్రముగ నుండుఁడి. నేనిపుడే మరలివచ్చి మిముఁ గూడెద. (అనుచు లోనికి వెళ్లును.)

(అర్జునుని సేన ప్రవేశము)

సేనాని—(స్త్రీలం జూచి) ఏమి యీచెలుల సౌందర్యంబు వీరిమోముం జూచిన నెట్టి ధీరుఁడైనను తన ధీరత్వము మాని మారుపకు లొగ్గఁడా! ఇపుడు నేనేమి సేయుదును? వీరినిఁ బల్కరించి చూచెద. చెలులారా! మీరెవరు? ఈ హయమునుఁ బట్టిన కారణంబేమి?

విశాల—అయ్యా! మేము స్త్రీలము. వినోదార్థ మీహయమును బట్టితిమి.

సేనాని—చెలులారా! మీరు స్త్రీలనునది మీమోముఁజూచినపుడే తెలి యును. ఈ గుఱ్ఱము ధర్మరాజుగారి యాగమునకుఁ గాను నిర్ణయింపఁ బడి దేశసంచారంబు సేయ విడువఁబడినది. దీనిని వెంబడించిన యోధ వరుఁడర్జునుఁడు. అతఁడజేయుఁడని మీరు వినియుందురు. అట్టివాని హయమునుఁ బట్టిన మిమ్మతఁడు మనసిచ్చునా? అతఁడిచటికి రాక మున్నే హయమును వదలివేయుఁడు. అగ్గితో సరసమువలదు.

విశాల—పురుషవర్యా! మీరు ధరించిన యాయుధములు విచిత్రములుగ నున్నవి. ఏదీచూతము?

(అనుచు యోధుల కృపాణములు సర్వముఁ దీసికొని) యోధులారా! ఈ యాయుధములు మీకేల?

సేనాని—శత్రువులతో యుద్ధమొనర్ప నాయుధము లుండవలెను.

విశాల—అటులైన నాయుధము లేకయే యుద్ధములు మీరొనర్పలేరా!

సేనాని—అది సాధ్యమగునా?

విశాల—ఆవిద్య మాకువచ్చును. మీకు నేర్పుదుము. వచ్చెదరా?

సేనాని—మీ రాఁడువారు. సంగర విద్యమీకెటులభించును?

విశాల—మాకు సంగర విద్యమాకుఁ జక్కఁగ వచ్చును. మీకుంగఱ దుముఁరండి. (అనియచటిసేనానుల నొకరొకరి నీడ్తురు. అందు నొ సేనాని.)

సేనాని—(కోపమున) చెలులారా! మీరు మానమర్యాదలను వదలిన స్త్రీలగనగపడెదరు. కాదేని పరపురుషుల శరీరమంటుదురా?

విశాల—అయ్యా! మాకు స్వపురుషులనిన మీరేను. పరపురుషులనిన మీరేను, రండి, మామందిరంబులఁ జేరి మారసుఖంబులనుభవించుచుందురుగాక. (అనుచు మరల సందటిని నీస్తురు.)

సేనాని—ఛీ! బుద్ధిహీనలారా! ఇట్టి దుడుకులొనర్తురేని మిమ్ము దుత్తునియలుగ నఱకి వేయుదుము.

వినీల—స్త్రీల నఱకుటకు మీకు నాయుధములు లేవుగదా? ఏమిసేయుదురు?

సేనాని—మానుండి మీరందిన కృపాణములిటు తెండి.

విశాల—బుద్ధిహీనులారా! అఁడువారి కిడిన వస్తువు మరలి వచ్చునా?

సేనాని—మీరివ్వరేని మీపైఁబడిలాఁగి కొందుము.

వినీల—ఛీ! బుద్ధిహీనులారా! పరాంగనలపైఁబడు మానహీనులా మీరు.

సేనాని—అటుసేయమేని మీరు మా కృపాణములియ్యరుగదా?

వినీల—మాకృపకు మీరుపాత్రులగుదురేని మీకృపాణంబులు మీకు నిచ్చెదము.

(అర్జునుని ప్రవేశము)

అర్జునుఁడు—(సేనానులఁ జూచి) సేనానులారా! పట్టఁబడిన గుఱ్ఱమును విడిచి తేక మీరీ స్త్రీలతో ముచ్చటలాడుచుఁ గాలక్షేపంబు సేయుచున్నవారా?

వినీల—అయ్యా! మిమ్ముఁగూడి ముచ్చటలాడుచుఁ గాలక్షేపంబుసేయ నొకరమణి కావలయునా?

అర్జును—ఛీ! రమణీ! ఆటలాడకు. యోధవరులతో రణక్రీడసలుపు క్రీడి నేనుగాని రమణులతో ముచ్చటలాడువాఁడనుకాను.

విశాల—మీరటులయిన, బృహన్నలులో! మీరు మాదేశములో సేవ నికని రారు.

అర్జును—(కోపమున) నారీమణులారా! మీపోఁగురుకూఁతలిఁకఁ జాలింపుఁడు.

విశాల—అయ్యో! ఇంకులోఁ బోఁగురుకూఁత లేమియున్నవి? రమణులతోఁ గాలక్షేపము సేయనిమగవారిని మేము మగవారని తలంపము. ఇఁక నాఁడువారందమూ యా యాఁడులక్షణము తమయందుఁ గానరాదు. కావున బృహన్నలు లంటిమి. ఇందుఁదప్పేమున్నది?

విశాల—విసీలా! ఇతఁడాఁడువారితోఁ గాలక్షేపము సేయు మగవాఁడును గాఁడఁట. ఆఁడుదియుఁగాదఁట. బృహన్నలయుఁగాదఁట. సన్యాసియై యాఁడుదానితో ముచ్చటలాడువాఁడుండునా?

అర్జును—(స్వగతము) వీరిమాయల మాటలకు నేబదులిడఁజాలను. మఱి యాఁడ స్త్రీలెంతటి పురుషులనైన లోఁగొను మాయావులని వినియుంటిని. ఇపుడది నిదర్శనమయ్యెను.) (పు॥) సేనానులారా! వీరినుండి మీ మీ కృపాణములను గొనుఁడి. కట్టఁబడిన హయమును విడువుఁడి.

విశాల—అయ్యో! మీ సేనానులెవరు నాఁడువారి సంటఁగల మగవారు కారఁట. లేసి మగతనము మీరారోపించిన వచ్చునా?

అర్జును—ఈ యాఁడువారిజోలి మీకువలదు. ఆ హయమును విడువుఁడి.

విశాల—అయ్యో! అదిసులభసాధ్యముగాదు. మా రాణిగారి యాజ్ఞ ననుసరించి మేమాహయమును గట్టినాము. వారియాజ్ఞ లేక విడువనియ్యము. ప్రమీల రాణిగారింతలో వచ్చెదరునిలువుఁడి.

అర్జును—అందుదానిరాకకు మేము గాచికొనియుండువారము కాము.

విశాల—అట్టిపురుషులను మేము సరకుసేయము.

అర్జును—సేనానులారా! మీరా తురంగమును ద్వరలో విడువుడి.

వినీల—అయ్యా! ఆహవకేళినైనను సంగజాకేళిలోనైనను ఘమ్ముగెలువనిది మేమా హయమును వదలము. ఎవరు దాని నంటుదురో చూచెదము.

(అనుచుఁ గత్తులు ద్రిప్పుచు నిలుతురు)

(ప్రమీలా ప్రవేశము)

(అనుబంధము 21)

అర్జునుఁడు—(దూరమునుండి ప్రమీలను జూచి)

(అనుబంధము 22)

ఆహా! ఈ సుందరి సౌందర్యంబూహాతీతముగనున్నది. ఈ సుందరినిఁ జూచిన క్షణమునుండి నామానస మతిచాంచల్యము వహించెను. ఔరా! దీనియందుము.

సీ॥ పులుగడిగిన మించు పుత్తడి బొమ్మయో? కందర్పునూతన కమ్రశరమొ?
తొగలరాయనిచాయ నగియొడి, జిగినిగ్గొ? జగదేకనవభాగ్య జలజభవయొ?
తుంపెసలారెడి తోలికారు జిగిమించొ? సౌరభాపూర సంచారలతయొ?
కలికి మాటల చేర్పుఁగల కిరిబంతియో? మదన మోహన పరమంత్రఫలమొ?
గీ॥ అనఁగ వెలయుకల్కి, యంగజాపూముల్కి
ఇందువదన రమ్యకుందరదన
కమలనయన, గంధ గజయాన, త్రిజగానఁ
గానమెందు, నింతచాన గాంచ.

(ఆలోచించి)

హా! హా! మానసమా! ఏలచలించెదవు? అగ్రజుని యాగాంతము వరకు స్త్రీ సంభోగవర్జితుఁడనని ప్రతిజ్ఞయొనర్చి దానికి భంగంబిపుడు గల్పింపనగునా? ఆ విరుద్ధకర్మంబు నానుండి సంభవించె నేని గామాతురుఁడనని నన్నుఁజూచినవారెగతాళియొనర్పరా? ఇంతకు నీ యింతి సవనాశ్వమును బట్టినకారణంబు నాతో బవరమొనర్చుటకని నే నూహించెద. సమ్ముఖమ్మున రాయభారమేల? ఆసుందరిని బల్కరించి నాసవనాశ్వంబు విడిపించికొనియెద. (ప్రమీలనుజూచి) ఓ! యిందు బింబాననా! నీవెవరు?

ప్రమీల—రాకుమారా! నేనుస్త్రీని.

అర్జు—నీవబలవని నీమోముఁగనినతోడనే యెఱుఁగనగును. దానినిఁజెప్పనేల!

ప్రమీల—నిజము. ప్రబలురను, సబలురఁజేయు సామర్థ్యముఁగల నబలను నేను.

అర్జు—రమణీ! హయమేధాంచితమగు నీతురంగమును బట్టితివేల?

ప్రమీల—తద్రక్షకుఁడై వచ్చిన నిన్నుఁబట్టుటకు.

అర్జు—సారసాక్షీ! నన్నుఁబట్టుటకు నిది మారసంగరము కాదుకదా?

ప్రమీల—రాజకుమారా! బద్ధమోహమున నన్ను నీ ముద్దుల మోహనాంగినిఁ జేసితివేని రతిబంధన కళానైపుణ్యముఁ జూపి నామృదులతరబాహుపాశముల నినుబంధించెద. కాదని యుద్ధమునఁ నిలిచితివేని నాతీక్ష్ణతర శరపాశముల నిను నేలఁగెడపి బంధించెద. ఇందున నీ కెద్ది సమ్మతమో చక్కఁగా నాలోచించి బదులిడుము.

అర్జు—(అచ్చెరువంది స్వగతము:) ఇపుడు నేనేమి సేయుదు? ఇది రామావతారమందగపడిన మాయాశూర్పణఖగ నగపడెను. ఎటు లుండనీ యిది యాఁడుది కదా? స్త్రీలపై బాణప్రయోగంబు వీర

లకుఁ జెల్లునా? లోకేశుఁడగు పరమేశ్వరునిపైఁ బూనిన శరములీ సర సిజాక్షి సుకుమార కోమలాంగముపై నుపయోగింపనగునా? కాలకే యాదిరాక్షసులపైఁ బిడుగులబలెఁ బడిన నావడిగల బాణము లీ భామామణిపై నెటులుపయోగింతును?

ప్రమీల—అర్జునా! నీవేమేమో యాలోచించుచు లోలోన బలవరించు చున్నావు. ఏమియది? ఆహవముఖంబున నీవు నాయెదుట నిల్వలేవు. అనంగ సంగర ముఖంబున నిలువఁగలవేమో యాలోచింపుము.

అర్జు—(కోపమున) మానహీనా! ప్రమీలా! మానముగల మానినీమ ణివి నీవనియెంచి నీపై నెటుబాణములుపయోగింతునని యాలోచిం చుచుంటిని. నీవుమదనోన్మాదపరీతచిత్తవై మర్యాద వీడి వెలిచేడియ లబలె వెలిఁబడి నోటిక్రొవ్వున మాటలాడెదవు. ఇఁక నీనాలుకఁ గత్త రింపకున్న నీకునుమానంబు బలమగును. ఇదిగో నాతీక్ష్ణశరము.

(అనుబంధము 23)

అర్జు—ఉత్సా॥ పోరుఁగోరితేనినీదు, పొంగుపార్ల సలుపుదున్
సారసాక్షి నీకునింత సాహసంబుఁ దగునటే

ప్రమీల—నోరుకుళ్ల మాటలాడ, నొవ్వదేర, రసన, యో
రోరి యుద్ధమందునిన్ను నోర్తుఁజేర్తు యమపురిన్.

ఓరీ! అర్జునా! ఏదీ నీశరలాఘవంబుఁ జూపుము.

అర్జునుఁడు—వృ॥ కండలూచ్చెడు కాండమిదే,
చండివచ్చెను జంపునిన్నున్

ప్రమీల— ఖండనంబునఁ, బ్రాణములన్
చెండిపైతును, జేరుమనన్.

అర్జునా! ఏదీ నీకాండము. కాండమయు నీరధిలోఁ గలసెనుగదా?

అర్జునుఁడు—ప్రమీలా! నాబాణధార నీవెంతవరకునోర్తువోయని పరీక్షించితి. ఇదిగో యీ తూరి నీప్రాణంబులు దీయుబాణమువేసెద.

వృ॥ నిశితబాణము నిన్నునంటెను
శశిముఖీయదె, జంపునిక్కము
పశమె; యీశుని. వాడిశూలము
దశను బాపెడు, తన్వియేరికి?

ప్రమీల—ఓరీ అర్జునా! ఇదియేనా నా ప్రాణములు దీయుబాణము! నీరసమైన నీనారసమారసాలయముఁజేరెను. ఏదీ, మఱియే బాణమును సంధింతువో దాని బలమించుకచూచెద.

అర్జునుఁడు—(అచ్చెరువంది) హా! హా! ఈ తరుణికినెద్దియో దైవసాహాయ్యమున్నది. కాదేని నా తీక్ష్ణశరపరంపరలకుఁ బ్రాణమున నిలుచునా? త్రిలోకైక విజయుఁడగు విజయుఁడొక మగువను జయింపలేడాయెనను నింద నాకువచ్చును. కావుననే నీమగువపై సమ్మోహనాస్త్రంబుఁ బ్రయోగించి మూర్ఛలోముంచెద.

మోహినీ; సమ్మోహనాస్త్రము, మోదమొందఁగ పందవే
ఈహమీఱ బెండువాఱుచు! నించఁబోశిరో; శూలవే.

(సమ్మోహనాస్త్రమునఁ బ్రమీలమూర్ఛపోయి నేలఁబడును. అర్జునుఁడు దాని సరసఁజేరి దాని సౌందర్యాతిశయములకు మదిమెచ్చుచు కైత్యోపచారంబు లొనర్చుచు) హా! హా! నేనెంతటి పాతకినో తెలియరాదు. యబలపైఁ బ్రబలమగు నస్త్రంబులుపయోగించితి. పౌలఁతులు పాడవు నాలుకవారు కావున బొగురు మాటలాడుచుందురు. ఇంతమాత్రమునకే, నాకుఁ గోపంబురానగునా? వచ్చెనుబో దివ్యాస్త్రములుపయోగింప నగునా? ఇపుడేమిసేయుదు? ఆహా! ఎంతకమ్మనిముద్దుల మోహనాంగి యిది.

సీ॥ అందమై మన్మనో నందమైసెల జేని చందమై చెన్నొందు సకియమోము
శుద్ధాష్టమీచంద్ర శుభబింబమునుబోలు బంగారుఫలకమీ ఫాలతలము
గొప్పలై మూలలు గొనసాఁగి అప్పల కప్పల నొప్పారు కలికి కనులు
ఇంచుక కొనవంచి యుంచిన యపరంజి ననదీరునునుపారు నాతినాస.

గీ॥ ఔర, శృంగార సౌష్టవంబౌర; యిచట,
ధాత నిర్మాణనిపుణతఁ దగెనయారె;
కటికి గుండియ నయిదివ్య కాండవితతి
దీనికాయంబు నొప్పించి దీనఁ జైతి.

హా! హా! ఇఁక నేనేమిసేయుదు ప్రమీలా! కఠినతరమగు నాశరము నీశరీరముఁగ్రుచ్చి నొప్పించెనా? నేనేమిస్తేయుదు. కోపమను భూతము నన్నావేశించి నాహృదయమును బాషాణమువలె గట్టిపఱచెను.

(ప్రమీల మూర్ఛఁ దెలిసి యర్జునుఁజూచి)

ప్రమీల—ఓరీ! అర్జునా! నీశరబలమున నేధరఁబడితినని గర్వింపకు. నీవు ప్రయోగించినది దివ్యాస్త్రముకావున దానిని గౌరవింప, నేఁజిక్కితి. ఇదిగో నీపై నిఁక నాశరంబులుపయోగించెద. వానిని నీ వెటుద ప్పించు కొందువో చూచెద.

వృ॥ కాలుఁ బ్రోలును, గనఁగఁ బంపును
కాలకంఠుని కఠినబాణము

అర్జు— మేలు మేలరె, మెలతకాంచుము
నేలఁగూలెను, నెలఁతవిత్తయై.

ప్రమీల—మీఱుశూరస, మీరవారము
గోరువ్యాళము, గ్రోలవచ్చెను.

అర్జు— నారినీదగు, నాదసంబును
జేరనీయక చీల్చివైచితి.

చూచితివే నారీమణీ! నీ నారాచంబును సహుదారిని నేఁ జీల్చితి. ఇఁక నీవేశాణంబుపయోగించెదవో చూచెద.

(అనుబంధము 24)

ప్రమీల—హా! హా! ఈ యోధవరుఁడు వీరాధివీరుఁడని నాకుఁదోఁచెడు. నాశరమ్ములన్నియును వమ్మయ్యెను. వీనికి నేనోడితినేని, నాపరాక్రమంబునకు న్యూనతగలుగును. నామంత్ర మహిమంబున నేనును సమ్మోహనాస్త్రంబుఁ బ్రయోగించెద.

సాహసంబీడేరనాశర, శక్తియుక్తినిఁ జూపెద
మోహబుద్ధి వీడుమాయిఁక ముక్తినందుమరక్తిమై.

(సమ్మోహనాస్త్రమహిమచే నర్జునుఁడు మూర్ఛపోవును)

ప్రమీల—(సరసంజేరి) హా! హా! ఈ పురుషవరుని శారీరలావణ్య తారుణ్యసంపదలెంత వర్ణించినను జాలదు. అయ్యో! ఇట్టిపురుషుని వరించి భర్తగఁజేకొను భాగ్యంబు నాకులేదాయె. నాకుఁ బురుషుఁడవు గమ్మని విధవిధముల నేవేఁడికొంటిని. అందులకు నీవుసమ్మతింపవైతివి. నేనేమి సేయుదు. శూరాగ్రణీ! ఇపుడు నేనేమిసేయుదును? నీ సౌందర్యంబు నాయట్టి సుందరిపై వినియోగింపక నేలపాలు సేయనగునా? సౌందర్య సౌజన్య, సౌభాగ్య, సాహస, పరాక్రమ సంపద లొక్కనియందుఁ గూడియుంట పూర్వ జన్మకృతపుణ్యఫలంబుగాదా? నాదగు సమ్మోహనాస్త్రంబు నీపైఁ బ్రయోగించి నాబుద్ధి జాడ్యత నేవెలివేసికొంటిని. నీయట్టి సుందరాంగుని సరస సరసతనుంటఁ బోకార్చితిని. నాథా! నాతో ముద్దుపల్కులు రెండుపల్కుము. అంతమట్టుకు సంతసంబైన నాకును గూర్పుము. ప్రాణప్రియా! లెమ్ము. కురువీరా! నేను మూర్ఛ

లోమునిఁగి మఱలలేచునపుడు, క్షణమాత్రమైనను నీకరువీరోరు సంపర్క సుఖంబనుభవించితి. అట్టి సుఖము నాకు సదాకాలము లేదాయెనేయని చింతించెద. అయ్యో! నినుఁబోలెడి యందకానింగూడి యానందాబ్ధిని నోలలాడక యుండు మందభాగ్యురాలి యందముండ నేమి మ్రుండనేమి. నిన్నువదలి నేనెటు మనఁగలను.

సీ॥ జ్యాకిణలాంఛనసార మై భుజగేంద్రు నగిరెడియెుగుభుజ యుగమువాఁడు
జానొప్పఁగాను భూజనులనడఁచునా జానుబాహోన్నతిఁ బూనువాఁడు
తలుపులవై శాల్య మలయింపఁ గలయట్టి వెడదగు ఱొమ్మున నదరువాఁడు
కేసరికానునా కే సరియనికేతి పిడికిటనడిగెడు నడుమువాఁడు.

గీ॥ అంగసౌందర్యమున కెల్ల నాలవాల
మయిన పైఁడి మెఱుంగుల మేనివాఁడు
మదవతులపాలిమదనుఁడు మానధనుఁడు
పంచబాణసమానుఁడు ప్రాణవిభుఁడు.

ఇట్టిసుందరాంగుని యెడఁబాటునేసహింపఁ జాలను.

(అర్జునుఁడు మూర్ఛనుండి లేచి)

అర్జునుఁడు—(స్వగ) నా భుజసారమంతయు నీభుజగాభ వేణియందు నీర య్యెను. నా దివ్యాస్త్రశక్తి యీశక్తియందు వమ్మయ్యెను. నేనేమి సేయుదు? క్రతుహయంబెటు సాధింతును. ఈరమణిసామాన్యస్త్రీగాదు.

తే॥ గీ॥ అబలగాదిది ప్రబలుర యాయువసెడి
యశన మేభక్షణమ్ముగ నధిక పుష్టి
నందిస్త్రీశక్తియనిభువి నవతరించు
కాళరాత్రియ సందియ మేలవలదు.

కావున దైవసాహాయ్య రహితుఁడనై యీ యహివేణిని నేగెలుచుట సందియంబు. నానేర్చిన దివ్యాస్త్రములలో బ్రహ్మాస్త్రమొకటి శేష ముగ నిలిచినది. అబలపై నట్టిదివ్యాస్త్రంబు ప్రయోగానర్హమని నేఁద

లఁతునేని నవనాశ్వము లభించుట నాకు దుర్లభము. అశ్వము లేదేని నాయగ్రజుని యాగంబు నిలుచును. పూనిన యాగంబు నిలిచెనేని పాండవ వంశమునకుఁ గళంకమువచ్చును. కళంకంబుగల కులంబు గ్రాలనేమి? కాలనేమి? నాయపజయము నన్నొకనినే బాధింపక నాకు లమునే బాధించును. కావున నే నెటులయిన నీస్త్రీని జయించి హయం బునయంబునఁగొని పోవలయును. దానికిబ్రహ్మాస్త్రమే ముఖ్యసాధ నము. దానిని నుపయోగించెద.

(ధనువు నంది బాణముచేతఁ బూని)

చ॥ అనవరతంబు శ్రీహరిని నచ్యుతునిన్ మనమందు నిల్పిభ
క్తి నినతులాచరించుచుమతిన్ నుతులన్ దనివారఁ జేయుదేన్
వినయముమీఱ హృత్కమలపీఠిమదగ్రజు నిల్పితేని నీ,
ఘనమగు నస్త్రమీతరుణికాయముఁ గప్పచుఁ గట్టివేయుతన్.

(అనుచు బాణంబుఁబూనును. పైనుండి)

ఆకాశవాణి—అర్జునా! నెమ్మదింపుము. ప్రమీలదేవాంశ సంభవురాలు. శత సహస్ర వత్సరంబులు నీవాస్త్రీతో యుద్ధమొనర్చినను గెలువఁజా లవు. శాంతవచనంబుల దానిసమ్మతిఁగొని వరింపుము. దీనినుండి నీకార్యసిద్ధియగును.

అర్జునుఁడు—ఏమియచ్చెరువిది? ఈ స్త్రీ దేవాంశ సంజనితయఁట. దీనిని సంగరంబున నెదుర్ప నలవికాదఁట. అటులయిన నిఁకయుద్ధ మనపేక్ష ణీయము. సామముగ్రాహ్యము. (ప్రమీలఁజూచి) మోహనాంగీ! అశరీరవాణి వచనంబులు వింటివిగదా? మనకిఁక నీకలహంబులాభ కారికాదు.

ప్రమీల—మోహనాంగా! ప్రారంభముననే నేఁబ్రణయ కలహంబుఁగోరి తినిగాని రణసాంబంధిక కలహంబుఁ గోరనైతిని. దానికి నీవు సమ్మతించియుంటివేని నింతటి వృథా ప్రయాసముండలేదు. ఇపుడేమాయెను రమ్ము (అనుచుఁ గేలుఁబట్టి)

గీ॥ పాన్పునందునఁబవళించి భావభవుని
బంధనంబుల ప్రౌఢతఁ బరఁగఁజూపి
ప్రణయ కలహంబుచేఁ బ్రేమఁ బరిఢవింపఁ
బ్రముదితాత్మల మగుదము ప్రాణనాథ.

అర్జునుఁడు—ప్రాణప్రియా! నాయగ్రజుఁడు హయమేధంబొనర్ప సమకట్టినాఁడు. అది సమాప్తమగునంతవఱకు స్త్రీసంపర్కము నేఁజేయను.

ప్రమీల—మోహనాంగా! ఈ హయమును భటులచే హస్తినావతికిఁ బంపుము. నీయన్న హయమేధంబొనర్చి సోమపానసుఖంబను భవింపనిమ్ము. నీవిచటననుఁ గూడినాయధరసుధారస పానసుఖం బనుభవించు చుండుము.

అర్జునుఁడు—నారీమణీ! నేఁబ్రతిజ్ఞాభంగుఁడగుట నీతికాదు. ప్రమీలా! ఈ దేశపు స్త్రీలు విషసండసితలు కావునఁ గామాతురలై పురుషులను బాధింతురు. ఘాతుకయతఁ బురుషులొక మాసములో నశింతురు. ఇక్కారణంబున మీరు హస్తినావతిఁజేరి శ్రీహరి సందర్శనంబు సేసినచో మీదేహాంతర్గత విషంబెల్ల నడంగును. నేనును భూసంచారంబొనర్చి హస్తినావతిఁజేరెద. పిదప మనము సుఖముగ నుండనగును.

ప్రమీల—నాథా! నీవు నాభర్తనైతివి కావున నీయానతిరీతి వర్తించెద రమ్ము. నాపురిఁజేరుదము.

అర్జునుఁడు—మోహనాంగీ! నీస్త్రీలెవరును నాజనుల బాధింపరేని నీపురిం బ్రవేశించెద.

ప్రమీల—నాథా! స్త్రీలనిన నెంతభీతిల్లెదవు. ఇట్టివాఁడు సన్యాసివై సుభద్రనెటుసాధించితివో? కానిమ్ము. ఆమాటలిపుడేల? నీయానతి రీతివర్తిల్లెద. రమ్ము.

(అనుబంధము 25)

[నిష్క్రమము]

# చతుర్థరంగము.



అరణ్యము.

(మేధోహోత—బ్రహ్మరాక్షసి—శిష్యులు—మలహూత—సరహూత)

మేధోహోత—(గూర్చునియుండును).

మలహోత—స్వామీ! గురువులవారూ! మాకు బ్రహ్మరాక్షసత్వముఁ బ్రాప్తించువిధము తెలుపరైతిరికదా? ఎన్నిదినంబులుమేము స్వాతంత్ర్యము వీడి మీశుశ్రూషచేయుచు నుండవలెను?

బ్రహ్మరా—శిష్యులారా! ఆపదవికి మీరింకను సర్హులు కారైతిరి. పదివేల జనుల మాంసము మీరింకను భుజింపరైతిరి. నరుల నరములను యజ్ఞోపవీతములుగ వడకు విధానంబు మీకింకను రాదాయెను. రుద్రాక్షమాలలకై సహస్ర బ్రాహ్మణుల శిరంబులు గూర్పరైతిరి. సహస్ర పతివ్రతా శిరోమణులను బట్టి బలవంతముగఁ జెఱుపరైతిరి. తుదకు గురుసేవకుఁ గొందఱిని సతులను బట్టి యప్పగింపరైతిరి. ఇట్టి మీకు బ్రహ్మరాక్షస పదవి యెటులభించును?

మలహోత—స్వామీ! మీరు ప్రారంభమున నానతిచ్చిన ప్రకారము మన రాష్ట్రములోనుండు నీదుల సారమంతయుఁ బీల్చి కల్లంతయు దెచ్చి మీకడుపు నించితిమిగదా?

నరహోత—ధారిని సంచరించి మానవకోటినిఁ బట్టి చీల్చి వారి మాంసము పచ్చిపచ్చిగ మీనోటఁ బెట్టితిమిగదా?

మలహోత—దేశదేశములు గ్రుమ్మరిలి స్త్రీలనుబట్టి మీపడకకు సిద్ధపఱచితిమిగదా?

మేదోహోత—కావుననే శిష్యులారా! నాకు బ్రహ్మరాక్షస పదవి చక్కఁగ సిద్ధించెను. అమృత సారమగు కల్లును మీరిఁకను కడవలు కడవలుగఁ ద్రావఁజాలరు. అపుడే మీకు నాయంతటి మహిమ యెటు కుదురును? అనేక సంవత్సరంబులు మముఁ బోలు పెద్దల నాశ్రయించి సేవఁజేయుచుంటిరేని మీకు నా మహిమ వచ్చును.

మలహోత—స్వామీ! మీచర్యఁ జూచిన బ్రదికినంతకాలము మాతోఁ బనులు సేయించుకొనుచుఁ జంపవలెనని యత్నించుచున్నవారని తోఁచుచున్నది. మీశుశ్రూష మాకిఁకఁజాలును.

నరహోత—నిజము. నిజము. నిద్రాహారములు వదలి సంవత్సరముల కొలఁది మీసుఖమునకై పాటుపడుచున్నను మీకిఁకను తృప్తిలేదు. మీపదవి మాకువలదు.

మలహోత—స్వామీ! ఆదిక్కునఁ జూడుఁడి. ఏదోయొక విచిత్రమగు గుఱ్ఱము వచ్చుచున్నది.

నరహోత—దూరమ్మున ధూళి యెంతగ వ్యాపించియున్నదో చూడుఁడి.

మలహోత—లక్షల కొలఁది జనులువచ్చుచున్నవారు.

మేధోహోత—(నిక్కి చూచి) శిష్యులారా! మీరు తలఁచిన క్షణముననే బ్రహ్మరాక్షస పదవి మీకుఁ బ్రాప్తిల్లు సమయము వచ్చెను. మీ యుపనయనమున కాజనులప్రేగులు జందెములగును. వారితలలు రుద్రాక్షమాలలగును. వారి రక్తము మీస్నానమునకు నీరగును. మీరు త్వరలోఁ బోయి యాగుఱ్ఱమును బట్టికొనిరండు. త్వరలోఁబొండు.

శిష్యులు—(చిత్తమనుచుఁ బోయి గుఱ్ఱమునుదెత్తురు. మేధోహోత దానిముఖముననుండు ఫలకమునుజూచి చదువుకొని తలయూఁచి) శిష్యులారా! మీరదృష్టవంతులు. మీాకేశ్రమయు లేక యుపనయనమగును. నాపదవివచ్చును. ఈ గుఱ్ఱమును దోలుకొని మనరాజగు భీషణునివద్దకుఁ బోవుదము రండు.

శిష్యులు—చిత్తము.

(గుఱ్ఱమును దీసికొని నిష్క్రమింతురు.)

## పంచమరంగము.



అరణ్యము.

(భీషణుఁడు, మేధోహోత, శిష్యులు, అర్జునుఁడు, సేన.)

భీషణుఁడు—ఏమియిది? నా యాహారంబు వెదకి తెచ్చుటకై పోయిన నా సేవకులిదివఱకు రారైరి? చిన్నతనమునుండి నరమాంసమలవాటుగఁ గలనాకు మఱి యేమాంసము రుచింపదు. నా సేవకులది యేలకో నేఁడు నరమాంసముఁ దేరైరి.

(మేధోహోత శిష్యులతోఁ బ్రవేశించును. భీషణుఁడు పురోహితునకు నమస్కరించి) స్వామీ! తాము పాదచారులుగ నిచటికి వచ్చునంతటి పనియేమి తటస్థించెను?

మేధోహోత—ఓరీశిష్యా! భీషణా! తిండితిని కండమెండయి కుంభకర్ణునిబలె నిద్రించుచు మూఢునిబలె రాజ్యతంత్రమెఱుంగక యున్నావు. మీతండ్రియగు బకాసురునిఁ జంపిన భీమసేనుని తమ్ముఁడర్జునుఁడు, నీసీమకు బెదరక వచ్చియున్నవాఁడు. వానిని వైశమ్మునఁబట్టి నరమేధ మొనర్పుము.

భీషణు—బాపురే! నాతాతను జంపిన ద్రోహికి సోదరుఁడగు నరునిఁ బట్టి తుత్తిమి నరమేధమొనర్తును. నాయొనర్పుఁబూను యాగమునఁ జచ్చినవానిని బశువుగఁ జేయనగునా యను సందియమొకటి నన్ను బాధించుచున్నయది. మనరాక్షసకులమున నిట్టినరమేధ మెవరయిన నొనర్చిరా? దీనివిధానంబెద్దియో తెలుపుదురని వేఁడుచున్నాను.

మేధోహోత—ఓరీ! మూఢరాక్షసుఁడా! పూర్వమున రావణుఁడను రాక్షసరాజు నరమేధంబొనరించి తనయిష్టార్థంబెల్ల సాధించెననునది నీవెఱుంగవా? ఈ నరమేధము సలిపినచో రాక్షస కోటికిఁ దృప్తియగును.

భీషణు—స్వామీ! ఈ యాగవిధానంబెద్ది? తెలుపుఁడు.

మేధోహోత—ఓరీ! భీషణా! ఈ యాగమునందుండఁదగిన ఋత్విజులు రాక్షసాచార సంపన్నులై చాతుర్మాస్య వ్రతమాచరింపఁదగిన వారుగ నుండవలెను.

భీషణు—స్వామీ! ఆచాతుర్మాస్య వ్రతవిధానంబెద్ది?

మేధోహోత—భీషణా! ఈ వ్రతము సేయువారు శ్రావణమాసమునుండి కార్తికమాసమువఱకు నెల్లకాలము సురాపానమత్తులై యుండవలెను. శ్రావణమాసమునందు మాహోపవాసులగు మానవుల శిరమునందుండు మాంసము మాత్రము భక్షింపవలెను. భాద్రపదమాసమున జటాధారులగువారి కంఠరక్తముఁ ద్రావియుండవలెను. ఆశ్వియుజమాసమున మానవకన్యకల యెదనుండు రక్తముఁ ద్రావవలెను. కార్తికమున నతి నియతులగు యతుల దేహమాంసము భక్షింపవలెను. ఇట్టియాచార శీలురగు రాక్షసులు ఋత్విజులుగా నోపుదురు. అట్టివారినిఁ బిలిపింపుము. నేనే దీనికి నాచార్యుఁడగుదును. పూర్వాచార పరాయణులై, యున్నత వటవృక్ష నివాసులై యుండు బ్రహ్మరాక్షసుల సాహాయ్యమున నరమేధంబు నెఱవేర్తును. యాగశాల నిర్మింపుము. ఆ యర్జునుని నరపశువుగఁ జేయుము. దీనినుండి నీకనేక సౌభాగ్యములొనఁగూడును. నీకులము వన్నెవాసియుఁగనును. ఈ సవనాశ్వము నిచటనే బంధించి యుంపుము. నీ సేననుగూర్పుము. పొమ్ము. నీ సోదరీమణులగు లంబోదరిని, యోజనస్తనిని బిలిపింపుము.

(ప్రవేశము అర్జునుఁడు సేన)

అర్జునుఁడు—ఓరీ! రాక్షసాధమా! సవనాశ్వంబును దొంగబలె దోఁచికొనివచ్చి యిటుడాగితివియా? ఇదిగో నీయుక్కడంచెద.

భీషణా—చం॥ అరెవరె! రాచకూన! యిటులార్వఁగ నేలరె? బాలుఁడందువో
సరిసరిపాలుఁ ద్రావఁగనుఁజక్కఁగనింటికిఁ బోరయేల, పో
నరమిటు? తల్లిదండ్రులకుఁ జక్కటి సూనుఁడవీవుగాన,నిక్,
నరపసరంబుఁ జేసెదను నాసవనంబున, నమ్ముమామదిక్.

ఓరీ! మానవాధమా! సొక్కి సిక్కి మాటలాడకు. నిన్నుఁ బట్టితెచ్చి నరమేధంబొనర్పు ప్రయత్నముఁ గొనుంటిని. వంటయింటి కుందేలు

మూడ్కి నీవై వచ్చి నాసమీపముఁజేరితివి. నినుఁబట్టి నరమేధంబొనర్చుటచే నాకు సకల సౌభాగ్యములు లభించును. నాకు వైరశుద్ధియగును. నీ సోదరుఁడు భీముఁడను క్రూరుఁడు నాతండ్రియగు బకాసురుని మున్నుజంపెను. నిన్నిపుడు నేఁ జంపి నా జనకునికిఁ దృప్తిఁగలిగించెద.

అర్జునుఁడు — ఓరీ! నీవు బకపుత్రుఁడువా? అటులైన నీవంశమే నాశనమునర్చు పని నాదయ్యెను. ఇప్పటికి నాయన్న ప్రారంభముననే దారిఁజూపినాఁడు. ఇఁక నినొక్కక్షణమైనను నిలుపఁజాలను.

భీషణ—వృ॥ నక్తంచరయీ, నారసమా
సక్తిఁగనుమా, చంపునిన్
రక్తిఁజనువా, రాచమిదే
రక్తంబిల్లపై, రాల్చునదే..

అర్జునుఁడు—నిలునిలుపలువా, నిక్కకునీ
తులువతనమునే, ద్రుస్లునీఁకన్

భీష— జలమునగదచే, జంపుదురా
బలమునుగనరా, పాఱకురా

అర్జునుఁడు—వేఁడిమిబాణము, వేడుకచేఁ
జూడుమదేహముఁ జొచ్చెనదే

భీషణు— బూడిదెగానయి, భూమిపడన్
ఓడకనిల్వర, యుద్ధమునన్

అర్జునుఁడు—ఓరీ! రాక్షసాధమా! నీపలుకు కూఁతలిఁకఁ జాలింపుము. నీబలమెంతటిదోయని పరీక్షింపఁ బ్రారంభంబున మృదుశరంబులు వైచితిని. చర్మము బలిసిన రాక్షస శరీరంబు నీది కావున నాబాణంబులు నీదేహంబుఁ జొరవయ్యెను. ఇదిగో యీతూరి తీక్ష్ణబాణంబు వేయుదు. ఈ బాణంబు నిజంబుగ నీపాడవడఁగించును జూడుము.

వృ॥ శాతశరంబు నిశాచరనీ
ఘాతలఁజేర్చును శాశుమీఁకన్
నీతరమాయని నిల్వఁగనన్
పాతకిఁజంపెడి బాణమిదే.

(అనుచు బాణంబువేయ భీషణుఁడు పడును.)

సేన—స్వామీ! రాక్షసకోటినిఁ బట్టి సంహరించి వచ్చితిమి.

అర్జు—సేనానులారా! నేను నీపాతకినిఁ జంపితి. ఆలస్యముగ నిటచ నిలువనేల? సవనాశ్వమును విడువఁడి పోవుదము.

సేన—చిత్తము.

[నిష్క్రమము[

# తృతీయాంకము—ప్రథమరంగము.

(మణిపురము.)

బభ్రువాహనుఁడు, సుబుద్ధి, ప్రతాపుఁడు, జయరత్నము, భట్టు,

దర్బారు.

(అనుబంధము 26)

(బభ్రువాహనుఁడు సింహాసనముపైఁ గూర్చునియుండ మంత్రులగు సుబుద్ధిమొదలగువారు తమకు నుచితములగు పీఠములపైఁ గూర్చునియుందురు. భట్టులేచి.)

భట్టు—(లేచి) జయజయ, స్వస్తి,
సమస్త సజ్జనస్తవనీయ సుగుణసమాజా
సకలదీనజనార్తి క్షయకర సురభూజా

అతులితామలయతి లోకగౌరవనీయ యగుమదమాదిగుణభాజా.
అనూననానాదానగుణాప హసితరాధాతనూజా
సూరిజనతా సంతోషబీజా
సుమహిత రవితేజా
బభ్రువాహన మహారాజా
విజయీభవ దిగ్విజయీభవ.

(నృత్యము.)

బభ్రు—మంత్రివరులారా! నానా దేశాధిపతులనుండి వివిధములగు కప్పములు నా ధనభాండాగారంబుఁ జేరెనఁట. నీలధ్వజుని నుండియు మరాళధ్వజుని నుండియు నెప్పటివలెఁ గప్పము రాక తడిసెనని మనకార్యదర్శి పలికెనుగదా? కారణమేమియుండును?

సుబుద్ధి—మహాప్రభూ! ఆ రాజులిటీవల తమరాష్ట్రములు వదలినారని వినినాను. కారణమేమో తెలియరాదు.

(సేనానియగు ప్రతాపుని ప్రవేశము.)

సేనాని—బభ్రువాహనమహాప్రభూ! వందనంబులు.

బభ్రువా—ప్రతాపా! విధాయకమగు సేవనిని వదలి యిపుడేలవచ్చితివి?

సేనాని—స్వామీ! మననగరోపవన సమీపమున నుచితవిధిని సేనతో వ్యాయామము సలుపుచుండ నెచ్చటనుండియో యొకలక్షణావృతంబగు హయరాజంబువచ్చెను. దానిని సమీపించి చూడ దానిలలాటమున నీహేమఫలకముండెను. దానిన్గొని హయంబును బంధించి, వచ్చితిని. ఇదిగో యా బంగరుపలక తమసన్నిధినుంచితి. (అందించును.)

బభ్రువా—(ఫలకముచేతనుంచికొని జదివి, కంటికి నొత్తికొని) మంత్రివరులారా! ఇదినాకు సుదినంబు. నా పెద్దతండ్రియగు ధర్మరాజు హయమేధంబొనర్చుచున్నవాఁడట. హయమేధాంచితమగు నశ్వమిదియఁట.

దీనిని రక్షింప, నా తండ్రియర్జునుండు, వెంబడించినాఁడఁట. చిన్నత నమునుండి నా తండ్రి మోమును వీక్షించు భాగ్యము నాకులేదయి యుండెను. నాతండ్రి లోకఖ్యాతినిఁగనిన పరాక్రమవంతుఁడఁట. ఎక్కటికయ్యమున ఫాలనేత్రుని నోడించిన వీరాధివీరుఁడఁట. దేవేంద్రుని సరిగద్దియపైఁ గూర్చుండిన గుణాఢ్యుఁడఁట. కాలకేయాది రాక్షసుల వంశమూర్చిన ధనంజయుఁడఁట. భీష్మద్రోణ కృపకర్ణాది వీరులఁ బిలుకుమార్చిన ధీరవరుఁడఁట. అట్టిసూరాగ్రగణ్యుఁడగు నాతండ్రినిఁ గనులారఁజూచి భక్తిపూర్వకంబుగ వందనాద్యర్చనలచే సత్కరించి మంగళవాద్యములచేఁ బురికిఁ దోడ్కొని రావలయును. మీరందఱు ననుఁగూడిరండు. పురంబు నలంకరింపఁజేయుఁడి. ఆలస్యంబునకుఁ గాలంబు లేదు. [నిష్క్రమము.]

(ద్వితీయరంగము.)

ఉపవనము.

అర్జునుఁడు—వృషకేతు, నీలధ్వజుఁడు, హంసధ్వజుఁడు, సాత్యకి, బభ్రువాహనుఁడు, సుబుద్ధి.

అర్జునుఁడు—గీ॥ వినుఁడిమిత్రులార ఘనశుభవాద్యముల్
వినఁగవచ్చుచున్న విధముదోఁచె
కారణంబుఁదెలియఁ గారాదు యుద్ధమో
మైత్రియొక్కొ మనకు మానకొదవు.

హంసధ్వ—అర్జునా! ఈ మంగళవాద్యముల నాదము వినినచో మనకీమణిపుర రాజుగారి మైత్రియొనఁగూడునని దోఁచెడు.

(సుబుద్ధి ప్రవేశించి)

సుబుద్ధి—పాండుకులాంబుధిపూర్ణశశాంకా! అర్జునా! మణిపురనగరాధిపతియగు బభ్రువాహనుఁడు తమదర్శనమునకై వచ్చుచున్నాఁడు.

అర్జునుఁడు — రానిమ్ము.

(సుబుద్ధి నిష్క్రమించి బభ్రువాహనునితోఁ బ్రవేశించుట)

బభ్రువా—ఉ॥ రంగుగఁ బాండువంశమున రాజిలుశూరులకెల్ల మేటియై
సంగరమందు నీశునకు సాటియనన్ యశమందిమించె నే
మంగళమూర్తి యానరుఁడు మాన్యుఁ డుదారమతిన్ వరించెఁ జి
త్రాంగదయన్ సతీమణిని రాగిలవారి సుతుండు మ్రొక్కెదన్.

గీ॥ బభ్రువాహనుండఁ బాలుండఫల్గునుఁ
డయిననీదుసుతుఁడ నధికభక్తి
నతులసేయువాఁడ నాయనా దీవించి
కావుమయ్య నన్నుఁ గరుణ మించ.

(అనుచు నర్జునుని పాదములపైఁ బడును. అర్జునుఁడు వాని తలఁదన్ని)

అర్జు—[కోపమున] చ॥ పిఱికిపిశాచమా యెవరు వీరులు లేనితఱిన్ హయంబునున్
వెఱపక పట్టి వీరులను వెంబడి వచ్చెడువారిఁ గాంచి ని
వ్వెఱపడితీవు, క్షత్రియుఁడవే? యదివమ్మను, నీదుతల్లియే
యఱమఱలేక వైశ్యునకు నారయఁ గన్నది నిన్ను హీనతన్.

ఓరీ! పిఱికీ! క్షత్రియకులమని బీరములాడుచు నాకులంబునకు నెంతటి కళంకంబుఁ దెచ్చితివి. ఛీ! బుద్ధిహీనా! నీతల్లి యెవరో యొక వైశ్యకులజునకు నిన్ను గనినది. కానిచో క్షత్రియబీజోద్భవునకు నింతటి పిఱికితనంబు వచ్చునా?

హంసధ్వజ—అర్జునా! పాదాక్రాంతుఁడగు వానిని నవమానపఱచుట మేలుకాదు.

నీలధ్వజ—ఫల్గునా! శరణని చరణములపై వ్రాలినవానినిఁ దిట్టిమరలించుట యుపాయము.

వృషకేతు—నాయనా! సుతుఁడని సమీపించిన వానిని సహితునిగాఁ దలఁచి పరుషములు పలుకుట గౌరవముకాదు.

అర్జునుఁడు—ఎవరేమిపలికినను పలుకనిమ్ము. ఈ పలువ, కోమటివానికిఁ బుట్టిన పందగాని క్షత్రియబీజోద్భవుఁడుకాఁడు. వీరులులేని తఱిఁ బౌరుషవంతునిబలెఁ గుఱ్ఱమునుగట్టి పిదపదానివెంబడించి శూరవరులనుఁగని భీతిల్లియేదోయొక యుపాయంబుఁ గల్పించుకొని ప్రాణము లుదక్కించు కొనవలెనని చూచుచున్నవాఁడు. ఇట్టివానికైనా మీరు గౌరవింపవలెనని నాకుబోధించుసది? మేలుమేలు.

బభ్రు—చం॥ జనకుఁడటంచుగౌరవము సల్పఁగవచ్చిన సూనుఁజూచి నీ
వనుచిత వాక్యజాలములు నాడుచుఁదిట్టితి నైనఁగాఁచితిన్
వినఁగనసహ్యావాక్యముల వీరనువైనపతివ్రతామణిన్
జననిని నిందసేసితివి జంకకశాత్రవుఁడైతి వందునన్.

(అనుబంధము 27.)

అర్జునా! నిన్నునేను నాయనా యని పిలుచునంతటి భాగ్యము నీవు నాకు నొసంగవైతివి. అంతటి భాగ్యంబు దైవంబు నాకొనగూర్చువఱకు నీకు శాత్రవుఁడై యుద్ధముఖంబున నీసుతుఁడని సాధించెద. పతివ్రతా శిరోమణియగు నాతల్లి నీవల్ల ననుగనె నను నది స్థిరపరచెద. అంతటి పనినేఁ జేయునంతవఱకు శాత్రవుఁడగు నిన్ను గౌరవింపను. నేఁడు సాయంకాలమైనది. కావున రేపు ప్రాతఃకాలమున యుద్ధమునకు సిద్ధుఁడవుగనుండుము.

(అనుబంధము 28.)

[బభ్రువాహనుని నిష్క్రమము.]

హంసధ్వజ—అర్జునా! నీవనాలోచితముగు పనియొనర్చితివి.

నీలధ్వజుఁడు—ఫల్గునా! నీవిప్పుడొనర్చిన పని నింద్యంబు.

వృషకేతు—నాయనా! నేను చిన్నవాఁడను కావున నిన్నేమియు ననఁజాలను.

అర్జునుఁడు— (అనుబంధము 29.)

మిత్రులారా! నిన్నబుట్టి నేఁడు కన్నుతెఱచిన బాలునకు నైమీరేల నింతగ తహతహ పడుచున్నవారు? ఒకవేళ వానివిషయమున నేను పరుషోక్తులాడి యుంటినిబో యాపసి బాలుఁడు నన్నేమి చేయఁగలఁడు? ప్రాతఃకాలమునసే రణమునకు వత్తునను బాలుని ప్రల్లదంపుఁ బలుకులు మీరు నమ్మితిరా? ఒకవేళవచ్చెనుబో, పౌరుషమునమించి పటుపరాక్రమవంతుఁడగు నీవృషకేతు వానినిబట్టి బిలుకుమార్పఁడా? ఏల మీకీ యాలోచన? ప్రొద్దైనది రండు నిద్రింతము.

[నిష్క్రమింతురు.]

## తృతీయరంగము.

ఇల్లు.

బభ్రువాహనుఁడు, చిత్రాంగద, ఉలూపి.

బభ్రు—(చింతించుచు) అహా! నాతండ్రి యాడిన పలుకులు వీనులకు ములుకులై నాటి, కోపంబు రూపంబుఁ గొనినరీతి మండిపడి పాపహేతుకమగు ప్రతిజ్ఞ గావొనర్చితి. ఇపుడు నే నేమియొనర్తును?

సీ॥ జననము భావింప జనకుని నెదిరించి ఖండనంబొనరింపఁ బాపమగును
పాపమంచని యెంచి ఖండనంబును వీడనా శపథము గను నాశపథము
శపథముఁ దలఁచుచు సంగరంబును జేయగెలుపొ యోటమియొ నేఁదెలియఁజాల
జనకునిఁ జంపిన జననికిశోకంబు గలుగును నేదానిఁ గలనెచూడ.

గీ॥ ఏమిదోఁపక యున్నది, యేమిసేయు
వాఁడనక్కట హృదయంబు వాడువాఱి
కలఁతఁజెందెను జ్వాల మాలలనుఁజిక్కి
వేఁగువిధమున నెంతటి వెడఁగునైతి.

(1) హా! నామానసము కర్తవ్యతా కర్తవ్యత విచారంబు మాని స్తంభించినది. నేనేమిసేయుదు. నాజనసమున శ్లాఘాధారభూతుండుగదా యర్జునుండు. జనకునియెదుట నిలిచి నేనెటు సంగరంబొనర్తింతును? జనకునినెదిరించిన వానికిఁ బుణ్యలోకంబు గలుగునా? తండ్రి యాజ్ఞను శిరసావహించి మున్ను శ్రీరాములు రాజ్యసౌభాగ్యసామ్రాజ్యములు వదలి కాననంబులఁ గందమూలాదులు భక్షించి కష్టపడిరని విన్నాను. అట్టి నీతినిఁ దిరస్కరించి తండ్రి నెదిర్చి యుద్ధమాడినచో ననిర్వచనీయ పాతకుండ నగుదునుగదా?

(2) హా! పాతకమునియెంచి నేను భండనంబును వీడితినేని నా సామంతరాజుల యెదుటనే సాహసించి చేసిన పౌరుష శపథంబు వ్యర్థమగునుగదా? నాశపథము రిక్తయగునేని వినినవా రేమనికొనియెదరు? ఉత్తర కొమారునిబలెఁ బ్రల్లదపు మాటలాడుచుఁ గార్యభాగమునఁ బందలబలెఁ బాఱు నిర్భాగ్యుఁడనిఁ బ్రేలుఁజూపినవ్వరా?

(3) ఒకవేళ జేసిన పంథముఁ గొనసాగింప సాహసించితినిపో యుద్ధమున జయము నాకగునో కాదో తెలియదు. ఒకవేళ జయము నాకొనఁగూడినచో జనకుఁడు విగతాసువగును. ఆవార్త విని నాతల్లి వానినిఁ దలఁచుచుఁ గన్నీరుఁగార్చుచు శోకాగ్నినిఁబడి క్రాఁగుచుండును. కడగండ్లు పడి పతివియోగంబునఁ గృశించు నాతల్లిని నేనెటులఁ జూచుచు సుఖమున మనఁగలను. అయ్యో! నేనేమిసేయుదును?

(చింతించుచుండును.)

(చిత్రాంగద ప్రవేశము)

చిత్రాంగద—ఏమివిచిత్రంబిది. నాగారాబు కొమారుఁడు తనతండ్రి మోముఁ జూచునంతటి భాగ్యంబుఁ దనకుఁ గలిగెనని యెంతో సంతో

షంబున నుప్పొంగుచు నతిశయమగు నుత్సాహంబుతోఁ జనకునిఁజూడఁబోయి యుండెనుగదా! తండ్రినిఁ బిలుచుకొని రాక యేకాంగిగ మరలివచ్చి యేకాంతముగఁ జింతించుచుఁ గూర్చున్నాఁడు. కారణమేమియుండును? మాటలాడించి కారణముఁ దెలిసికొనియెద. (బభ్రువాహనుని సమీపించి) నాయనా! బభ్రువాహనా! సంతోషసమయంబునఁ జింతించుచుఁ గూర్చుంటివి? కారణం బేమి? నీతండ్రిగారినిఁ జూచితివియా? వారికి వందనంబులిడి వారిదీవెనలందితివియా? నీజనకుని యేల యిచటికిఁ బిలుచుకొని రావైతివి? మాటలాడుము. మౌనమూనిన నాగతియేమి?

బభ్రువాహనుఁడు—(నిట్టూర్పుసారించుచు) అమ్మా! నే నేమని తెలుపుదును?

(అనిమౌనమూనును.)

చిత్రాంగద—నాయనా! నన్నేల యీరీతిఁ దపింపఁ జేయుదువు? నీ సంతోషాభివృద్ధిఁ జూచికదా నే నీ ధరమనినాను.

బభ్రువాహ—జననీ! నేనింతకుమున్నెంత సంతోషవారధిలోఁ దేలుచుంటినో యంతకంటె నూరుమడుంగులు చింతాబ్ధిలో మునిఁగినాను.

చిత్రా—నాయనా! అంతటి చింతకుఁ గారణమేమి తటస్థించెను?

బభ్రు—అమ్మా! నాతండ్రిగారి దివ్యదర్శనమునకుఁ బోయియుంటిని.

చిత్రా—నిజము. పోయియుంటివి. ముందేమిజరిగెను?

బభ్రు—నాజనకునిఁ జూచి నాకులగోత్ర జననీ జనకుల నామంబులు దెలుపుకొని వందనంబు లాచరించితిని.

చిత్రా—నాయనా! నీ తండ్రి నిను గౌఁగిలించికొని దీవించెనా?

బభ్రు—(నిట్టూర్పులువిడుచుచు) అమ్మా ఏమని తెలుపుదును? తన కాళ్లతో నాతలఁదన్ని వెడలిపొమ్మని పరుషోక్తులాడెను.

(అనుబంధము 30)

చిత్రా—ఏమీ! ఏమీ!! కానక కానక కాంచిన కొమారుఁడని నినుఁ గౌఁగిలింపక కాళ్లతోఁదన్నెనా? కారణమేమియుండును?

బభ్రు—జననీ! వీరులు లేనిదితి బీరముతోఁ దురగమును బంధించి వెంటనే వెంబడించిన వీరులనుఁ జూచి వెఱచి పిఱికినై సంగరము మాట చాలించుకొని తన చరణాక్రాంతుఁడనయి శరణంటినఁట. కావున నేను తనకొడుకు కాదఁట.

చిత్రా—హా! హా! అనుచుఁ జింతించుచుఁ గూర్చుండి) హా! ఎంతటి కర్ణకఠోరంబగు మాట నా చెవిఁబడెను. తండ్రీ! ఇంతటి మాట నాప్రాణ భర్తపల్కనుఁడాడెనా?

బభ్రు—తల్లీ! అంతయకాదు. నా మానసశూలముగ మఱికొన్ని మాట లాడెను. అవి నీయెదుటఁ బలుకఁ దగినవికావు.

చిత్రా—నాయనా! ఆమాటలెవ్వి?

బభ్రు—అమ్మా! ఆదుర్వచనంబులు నానోటనేనునుడువఁజాలను.

చిత్రా—తండ్రీ! నీకేల సంకోచంబు? నా విషయమేమయిన నాఁడెనా!

బభ్రు—హా అమ్మా! అవును.

చిత్రా—నాయనా! ఏమియాడెను?

బభ్రు—జననీ! నన్నేల యీరీతిఁ గ్రుచ్చియడిగెదవు?

చిత్రా—నాయన్నా! నాప్రాణభర్త నావిషయమేమి తలంచెనో యది తెలుసుకొనవలెను?

బభ్రు—అది తెలిసిన నీకుఁ జిత్తక్లేశమధికమగును.

చిత్రా—ఏమయినను గానిమ్ము నాకు దానిఁ దెలుపుము.

బభ్రు—అమ్మా! నీవింతగఁ బట్టుపట్టినచో నాయత్నములేదు. నీయానతి నేధిక్కరింపఁజాలను. హా! (నిట్టూర్పు నారించుచు) జననీ! నీవు వైశ్యుని సంయోగంబున నన్నుఁగనినావఁట. కావుననే నాకుఁ బిఱికితనంబు వచ్చెనఁట.

చిత్రా—(చింతించుచుఁగూర్చుని)

చ॥ అవనిని క్షత్రియోత్తముని యన్వయమందు జనించి యాజిలో
భవుని నెదిర్చినట్టి యతి బాహుపరాక్రమశాలి నర్జునుం
ధవునిగఁ జెట్టఁబట్టుచు నధర్మవిధంబుగ వైశ్యుఁగూడి, దు
ర్భవునిగ నిన్నుఁ జేసితిగదా? పాతకినేను; ధరింపఁ బ్రాణముల్.

తనయా నానుండి నీకుఁ గులహీనతఁగలిగెనుకదా? అయ్యో! నానుండి కదా సరివారిలో నీకింతటి పరిభవము కలిగెను? పుత్రా! ఇంతటి పాతకిని నేను ప్రాణంబున నీభువిమనఁజాలను. నాయనా! నీతండ్రి నిన్నింతగఁ బరిభవించినను నీవు దానికి బదులిడక దనయవిధేయతలు చూపుచు మరలి వచ్చితివికదా?

బభ్రు—అమ్మా! నాతండ్రి నిన్నింతగ దూషించినది నేసహింపఁ జాలక తామసము వహించి, రేపటిదినంబున నీతో యుద్ధమొనర్చి నాతల్లి,

పరమపతివ్రత, వీరమాత, యని సాధించెదనని ప్రతిజ్ఞ యొనర్చి వచ్చితిని.

చిత్రా—హా! హా! కుమారా! ఎంతటి యపరాధంబొనర్చితివి? జనకుని యెడ నవిధేయతఁ జూపుట స్వామిద్రోహముకాదా? స్వామి ద్రోహిత్వము రౌరవాది నరకమూలంబగునుకదా? ఎంతటి మంతొనర్చితివి?

బభ్రు—అమ్మా! అక్కారణంబుననే నేను జింతించుచుంటిని.

చిత్రా—నాయనా! నీవిపుడు మరలవెళ్లి నవనాశ్వమప్పగించి తప్పాయెనని యొప్పుకొనిరమ్ము. సంగరము మాట తలంపకుము. నిజము నాప్రాణ భర్తకు నిలుకడపైఁ దెలియనగును.

(ఉలూపిప్రవేశము.)

ఉలూపి—చెల్లెలా! ఏమిచింతించుచున్నావు? మనకుమారుఁడగు బభ్రువాహనుని మోమేల చిన్నపోయినది?

చిత్రా—అక్కా! నేనేమని తెలుపుదును? మన భర్తయిచటికివచ్చినాఁడు.

ఉలూపి—సంతోషము. అతఁడేమి మహారాజు. దేశదేశములు సంచరించును. దేశాధిపతుల కూఁతురులను బెండ్లియాడి వెళ్లిపోవును. మరలవారెవరు, ఎచటనున్నారు, ఎటులున్నవారు, బ్రదికినారా చచ్చినారా యను విషయము స్వైతము విచారింపఁడు. మంచిసమయములోనే నిచటికివచ్చితిని. ఫల్గునుని మందిరంబునకుఁ బిలిపించి యుత్సవంబులు సలుపక చింతించుచున్నవారేల?

చిత్రా—అమ్మా! నేనేమని యీవార్తఁదెలుపుదు? నీకొమారుని నడిగి తెలిసికొనుము.

ఉలూపి—నాయనా! బభ్రువాహనా! మీతల్లిమాటలు వింటివికదా? అంతటి విషాదకరమగు వార్తమేమియది?

బభ్రు—అమ్మా! అవమానకరమగు వార్త నేనెటు వెల్లడింతును?

ఉలూపి—నాయనా! నేను వేఱుకాదుగదా! నీపెత్తల్లినిగదా!

బభ్రు—అమ్మా! అంతగ నడిగెదవేల? తెలిపెదవినుము.

సీ॥ జనకుఁడటంచు నే సత్కరింపఁగఁ బూనిసవ్యసాచినిఁ జూడఁ జనితినమ్మ
చని, జనకునిఁగని తనయుఁడననిపల్కి ఫల్గును పదములఁ బడితినమ్మ
పదములవ్రాలనక్క గదిరించి తలఁదన్ని వైశ్యుని సుతుఁడని పల్కెనమ్మ
పలికిన పలుకులు ములుకులై చెవిసోఁక దండ్రిని నెదిరింపఁ దలఁచితమ్మ.

గీ॥ ఉదయమునయుద్ధభూమిని నెదురుపడుచుఁ
సంగరంబున నామాత సతిగ, నీకుఁ
దెలిపెదనటంచుఁ బంతంబు సలిపితమ్మ
మరలివచ్చితినమ్మ దుర్మార్గుఁడగుచు.

అమ్మా! ఇడియ నా గొనరించిన యపరాధంబు తండ్రికి నవిధేయతఁ జూపితినని నాతల్లికోపించుచున్నది. నేనేమిసేయుదు? నాతండ్రిపలుకులు వినినంతనే, నాకుఁ దామసగుణంబు హెచ్చెను. అందున నా సామంత రాజుల యెదుట నన్నవమానపఱచిన కారణంబునఁ గోపమాకారముఁ గొనిన వానిభంగి నటించితి.

ఉలూపి—ఏమిచెల్లెలా! చిత్రాంగదా! అంతటిమాట నీవు వినియును సైఁచితివిగదా! నీయోర్పు హెచ్చు. నీకయిన యవమానము నాకుఁ గాదా? నీబలె నన్నును నర్జునుఁడు పెండ్లియాడఁడా! పరిణయమైన భామలను వదలిన తప్పొకటియ చాలక పైపెచ్చుగఁ బరిభవింపఁ దలఁచినాఁడా? పురుషులు తమ తరుణులను వదలిన మాత్రమున నట్టి

తరుణులందఱు జారిణులగుదురా? ఎంతటి క్రొవ్విది. నేఁడునిన్నవ మాన పఱచినభంగి తేవు నన్నవమానపఱచును. మనము శారీర సాంబంధిక శక్తిని నబలురమైనను బుద్ధినిఁ బురుషులకంటెను దక్కు వయా? మానమర్యాదల విషయములోఁ దక్కువయాఁ? అతఁడు మము నిటుల ధిఃకరించి పలుకనగునా? నీవు పతివ్రతవుకావా? వీరమాతవు కావా! నీ కొమారుఁడు క్షత్రియోత్తముఁడు కాఁడా! వీరుఁడుకాఁడా! మున్ను లవకుశులు తమతండ్రియగు శ్రీరాముల నెదిరించి తమతల్లియగు సీతను వీరమాతయనిపించి తమనిష్కల్మష జననీత్వము స్థాపింపరా? అటులనే మనకొమారుఁడొనరింపనిమ్ము. క్షత్రియోత్తముఁడని స్థిరపఱుపనిమ్ము. నీవు సతివని స్థాపింపనిమ్ము నిష్కారణమ్ముగ నబలుర దూషించువారికగు శిక్షకావింపనిమ్ము. ఆబాలుని నీవేవిధ మున దూషింపకు. శ్లాఘ్యతమమగు పని మనబాలుఁడొనరించినాఁడు కావున దైవము వానిరక్షించును. (బభ్రువాహనునిఁజూచి) నాయనా! నీతల్లికి నమస్కరింపుము. (చెల్లెలఁజూచి) చెల్లెలా! నీయిష్టదైవంబును నిష్కల్మణ హృదంబుజంబున ధ్యానించి నీకొమారుని దీవింపుము.

చిత్రాంగద—అక్కా! తండ్రిని నెదిరించిన సుతునకుఁ బుణ్యగతు లుండునా?

ఉలూపి—చెల్లెలా! మనకొమారుఁడార్జునుని కొమారుఁడని స్థాపించిన పిదపఁగదా సుతునకు విధాయకమగు భయభక్తులు తండ్రియెడఁ జూపవలెను.

చిత్రాంగద—అక్కా! ఈ విషయమున నాకేమియుఁ దోఁపదు కావున నీహితము ననుసరించెద.

ఉలూపి—అటులైన నీకొమరునను దీవింపుము. (బభ్రువాహనునిఁజూచి) కుమారా! నీతల్లికి నమస్కరింపుము.

బభ్రు—తల్లీ! నీచరణములపైఁ బడెద దీవింపుము.

(అనుచు నమస్కరించును.)

చిత్రా—సీ॥ అసురుఁడౌ వృత్రుని యసురార్ప, సురలెల్ల మఘవున కిచ్చిన మంగళంబు
సుధనుఁ దెచ్చెడుతఱి శుభముగ వినుతమాత యిచ్చిన ఘన మంగళంబు
వామనునకుబలి బంధనంబున, సురమాత యొసంగిన మంగళంబు
సుధనుఁ జిల్కెడువేళ సురలకు, నదితి, తానంగుగాని జయ మంగళంబు
కాకుత్స్థునకు నాఁడు కౌసల్యజనని తా మమతను నిడినట్టి మంగళంబు॥

గీ॥ నీకునగుఁగాత, తనయ; నిర్ణిద్రుఁడగుచు
క్షత్రియోత్తముఁ డను పేరు సార్థకముగఁ
జేసి చేరుమ తల్లిని శీఘ్రముగను
కీర్తికుసుమంబు పరిమళస్ఫూర్తివెలయ.

బభ్రువా—(ఉలూపినిఁజూచి) అమ్మా! నీపాదాంబుజంబులకు వందనంబు లర్పించెద.

ఉలూపి—నాయనా!

గీ॥ సకల లోకైక విజయుఁడౌ సవ్యసాచి
సంగరంబున నెదిరించి సాహసంబు
సలిపి నీతల్లి సతియని తెలుపుమన్న
ధీరుఁడని నిల్పుమా, తండ్రిపేరు ధరను.

తనయా! బభ్రువాహనా నీశాస్త్రాస్త్రములెల్ల నెల్లకాలంబుల స్మరించుచు నెద్దియు రిత్తపుచ్చక సాహసించి రణంబొనర్పుము. ఫలము దైవాధీనంబని దృఢముగ నమ్మి నీవు రణమొనర్తువేని నీకు జయంబు సమకూరును. యుద్ధమొనర్చు సమయంబున నర్జునుఁడు నీ తండ్రియను తలంపు నీమానస మంటనీయకు. నీతల్లి దీవెన నీకు జయమొనఁగూర్చును. శుభముగఁ బోయిరమ్ము.

బభ్రు—తల్లీ! నీహితోపదేశంబు నే సదాకాలంబు స్మరించుచుండెద. పోయివచ్చెద. [నిష్క్రమము.]

# తృతీయరంగము.



యుద్ధభూమి, శిబిరము, అర్జునుఁడు,

అర్జునుఁడు—(నిద్రించుచు స్వప్నమంది దిగ్గున లేచి) ఏమిది? ఎంతటి దుస్స్వప్నముఁ గంటిని. ఇది తెల్లవాఱుజాముగదా? ఇట్టిసమయంబున నగు స్వప్నము నిజమగునని పెద్దలాడుదురు. ఇదియేమో యనర్థమూలముగనున్నది. ఉభయకుల పితామహుఁడగు భీష్ముఁడు నాకట్టెనుట నిలిచి యోరీ ద్రోహీ తండ్రిలేని పిల్లయని పసితనమునుండు నిన్నుఁ గాపాడి విద్యాబుద్ధులుగఱపి పెంచి పెద్దఁజేసిన నాయుపకారంబు స్మరింపక మోసగించి నన్నుఁజంపితివిగదా? ఆదోషంబు నిను వెన్నంటి బాధింపదా యని కంఠోక్తిగ నుడివెనుగదా? అయ్యో! నాతాత నేనెంతద్రోహమొనర్చినను నన్నుమన్నించి యవసాన సమయమునందైన నన్ను విడనాడక యుండెనుగదా? ఇపుడేల నన్నిటు బెదిరించి యుండును? నాకృత్యము నామానసమును బాధించుచు స్వప్నమున స్మరణకుఁ దెచ్చినది. ఈ నాపరుండిన స్థలముచెడ్డది. మఱియొక స్థలమునఁ బరుండెద. (అనుచుఁ బరుండును.) (మరల దిగ్గున లేచి) ఏమీ? కనులుమూసినతోడన దుస్స్వప్నములు బలమగుచున్నవి. భారత రణావనిని నాచేఁ గూలిన వీరులందఱుఁ గుమిగూడి నిద్రఁబోవు నాకంఠముఁ ద్రుంపఁ బైఁబడుచున్నవారే? ఇట్టి దుస్స్వప్నమునకుఁ గారణమేమి యైయుండును? హా! హా! ఆపసిబాలుఁడు ప్రాతఃకాలంబుననే నాపై యుద్ధమొనర్తునని పంతములు పలుకుచుఁ బోయెను. వాఁడు బాలుఁడైనను శూరుఁడుగ నగపడెను. వానినుండి నాకేమయినను బరాభవము కలుగునా? ఏమి భీతియిది? చిన్నతనమునుండి పటుపరాక్రమ

వంశుఁడగు నేనొక బాలునకింతగ భీతిలవలెనా? బాల్యమున నే గురుదక్షిణార్థము నిండుకయ్యమున ద్రుపదునిఁ బట్టి ద్రోణాచార్యుల చరణములందుఁ బడవైచితి. ఎక్కటికయ్యంబున నంగారపర్ణుఁడను యక్షుని నెదిర్చిమెప్పించితి. అగ్ని ప్రీత్యర్థము ఖాండవ దహనంబున నింద్రుని నోర్చితి. కిరాత వేషంబూని వచ్చిన యీశ్వరునితోఁ బోరి యతని నొప్పించి మెప్పించి పాశుపతాస్త్రంబందితి. సురలకజేయులయి వారిని బాధించుచున్న నివాతకవచాదుల యసురార్చితి. భారతరణంబున భీష్ముని శరపరంపరల నొప్పించి కెడపుచు నాతనిపై నాకుఁగల గౌరవ సూచనార్థము తలఁపుపరుండ, శరపరంపరలచే మంచమొనర్చి దానిపై శయనింపఁజేసితి. ఇంతటి సాహస కార్యములొనర్చి మించిన పటుపరాక్రమవంతుఁడగునే నీ బాలునకు వెఱతునా? వెఱవను. వెఱవను. ఏనాఁడును నాకింతటి దుస్స్వప్నము కలుగదే? నేఁడేల కలిగెను? నావామాంగ మెల్లెడ నింతటి చలనంబుఁ గలుగుటకుఁ గారణమేమి యుండును? (అనుచు నడచుచు) ఏమీ? దీపకాంతికి నగపడు నా శారీరపు నీడకుఁ దలలేదు. ఏమాయెను? నాకు శిరమున్నదియో లేదో. చూచికొనియెద. (అనుచుఁ గరములచే శిరమునంటును.) శిరమున్నదియే? నాకగపడు నీడయందేల నా శిరచ్ఛాయ నగపడను. ఇది మృత్యుసామీప్యమును సూచించునని పెద్దలాడరా? ప్రాతఃకాలము వచ్చినది. దూరము నగపడు మణిపుర పురమునందు రణభేరి మ్రోయుచున్నది. కానున్నది కాకమానదు. ఇపుడు నే వెఱచి వెనుదీసినఁ జూచినవారు నవ్విపోదురుకావున రణమొనర్తును. ఆ బాలుని నే నెదిరించెద. నాకిఁక నిద్రచాలు. పోయి యుద్ధభటులను సిద్ధపఱచెద.

[నిష్క్రమణము.]

# పంచమ రంగము.



(యుద్ధభూమి.)

బభ్రువాహనుఁడు, అర్జునుఁడు, వృషకేతు, ఉభయసేన, (వాద్యము.)
(వాద్యములతో యుద్ధభూమి నుభయసేనయుఁ బ్రవేశించును.)

వృషకేతు— (అనుబంధము 31)

(అర్జునునిఁజూచి) నాయనా! ఈ పాలుఁద్రావు బాలు నెదిరింప నీయంత టి పటువిక్రమశాలి కావలయునా? నేఁ జాలనా? నేను పరాక్రమవంతుఁడుకాననీ నీకు సందియమా? పెద్దలగువారు పిల్లలను యశోవంతులఁ జేయుట యపేక్షణీయముకాదా? నాయనా! నాకు సెలవిమ్ము. విరిసిన సంపెగ పుష్పరసమును భృంగశాబకమంటునా? ఆశ్వాదింపఁ బ్రయత్నపడునా? కులాచలము నెదిరింపఁ బ్రయత్నించినను మహామారుతము వశమగునా? సన్నెదిరింప, నాపసిబాలుఁడోపునా? నాయనా; సెలవిమ్ము.

గీ॥ వాతఘాతమునను పాతమావృక్షంబు
మాడ్కి నరినిఁగెడపి మరలి వత్తు
నాకు సెలవునిమ్ము నాయనా వేగమ్మె
నతులొనర్తు నీకు నతులభక్తి.

(అనుచు వందనంబులిడి నిలుచును.)

అర్జునుఁడు—(చింతించుచు) నాయనా! నీధైర్యపరాక్రమములు నాకేమి క్రొత్తవి కావు. సింహకిశోరము ముంగిట గజశాబకము నిలుచునా? నీయెదుట నా బభ్రువాహనుఁడు నిలుచునా? అయినను నీతూరి నిన్ను రణంబొనర్పఁ బంపుటకు నామనసు మరాదు.

వృష—నాయనా! ఇది యేమి విచిత్రము? దుఃఖంబుసూచించుచు నిరుత్సాహకరముగ మాటలాడుచున్నావు. కారణం బేమి?

అర్జునుఁడు—నాయనా! నే నేమని తెలుపుదును? నిన్నటిరాత్రి నే నొక యశుభకరస్వప్నంబు గలఁగంటిని. భారతరణంబున నాచే నిహతులయిన వీరులందఱు నన్నుఁజుట్టి ముట్టి నాకంఠంబుఁ దెగనఱకిరి. నే భీతిచే లేచి పాదచ్ఛాయ వేయుచు నా నీడను నేను జూచికొంటిని. నాశిరము నాకగపడ లేదు. కావున నాకిది యమంగళకరమగు సమయంబు. ఇట్టి సమయంబునఁ బాండవ వంశాంకురమగు నిన్ను నేఁ గోల్పోవఁజాలను. నేనే రణావనిఁజొచ్చి నా సాహసంబుఁ జూపెద.

వృష—నాయనా! దుస్స్వప్నముఁ గాంచి నిరుత్సాహమున మనోజయము నందక నీవాజిని నిలుచుట సమంజసముకాదు. నాప్రాణములనైనఁ గోల్పోవ సిద్ధుఁడనగుదునుగాని నిన్నీతూరి నాప్రాణంబున సమరమునకు వదలను. చిన్నవాఁడు మూర్ఖుఁడయ్యెనని నన్ను నీవు నిందింతువుగాక.

బభ్రు—యోధవరులారా! మీ యాలోచనలు ముగిసెనా? జీవితకాలము వఱకు నిటులనే జరుగుచుండునా? అడుగో దూరమ్మున మా యుభయుల సేనకు సంకులసమరంబు ఘోరమ్ముగ సంభవించినది. మిమ్ము నేనిపుడు వెదకికొనివచ్చితిని. మిమ్ముఁ దెగటార్చి మరలనేను నాసేననుగలసి కొనవలెను. మీరు భయములేకనైగాని, యొకరొకరుగాని, త్వరితగతిరండు.

వృష—ఓరీ! పొగరుపోతా! ఇంచుక నిలువుము. నీపొగరార్చెద. (అర్జునునిఁజూచి) నీవు వడిగ మన సేనను గలసికొనుము. ఈ బాలునిఁ దెగటార్చి నిను వచ్చి చేరెద.

అర్జు—నాయనా! అటులోనర్వము నేఁబోయెద (పోవును.)

వృష—ఓరీ! బభ్రువాహనా! కులము నాలుక తెలుపుననురీతిఁ బెద్దల యెడ నగౌరవముగ మాటలాడితివి కావున నీవు హీన కులజుఁడని స్థాపించుకొంటివి.

బభ్రువాహ—ఓరీ! నీవేకులజుఁడవు? నీపేరేమి? నీతండ్రిపేరేమి?

వృష—ఓరీ! బభ్రువాహనా! నేనుసూర్యచంద్రుల వంశజుఁడను. నాపేరు వృషకేతు. నాతండ్రిపేరు కర్ణుఁడు.

బభ్రు—ఓరీ! కర్ణుఁడనఁగ నెవఁడు? రాధేయుఁడా?

వృష—నిజము. నిజము. అరాధేయుఁడేనాతండ్రి.

బభ్రు—సరిసరి. తెలిసెను. సూతకులజుఁడవా నీవు? ఈ వాహినీ నీరధిని దాటింప నోపుదువు నీవని కాఁబోలు నీయర్జునుఁడు వెంటనిడికొని వచ్చినాఁడు. మున్ను సుయోధనుఁడు తనసేనాంబుధిని సురక్షితముగ దాటింపఁ గర్ణధారుఁడు కర్ణుఁడని నమ్మి నడిసముద్రమున మునిఁగిపోయెను. ఆ రీతిని నీవు నీయర్జునుని బలంబు ముంతువనుటకు సందియంబులేదు.

వృష—ఓరీ! భూనాధమా! మాటలనుండి ప్రయోజనంబేమి? మాటల బేరమువలదు. శరవ్యాపారమున లాభనష్టములుగని పొట్టుదము.

మ॥ కో॥ వీరధర్మముఁబూని, పోరున వీఁకఁదక్కక నిల్వరా
ఘోరమౌశరధార, నాలుకఁ గోయునిప్పుడె చూడరా
బభ్రు— కారుకూఁతలఁ గావ్యమానెటు కార్ముకంబిదె కానరా
శూరవాదము మ్రింగఁగాంచెడి, చూడరా శరధారలన్.

ఓరీ వృషకేతూ! నీశరమును దాటినేనజత నిను మ్రింగు శరముఁబంపితిని. నీరుధిరంపుఁ జవిఁజూచి నామార్గణంబు మదమందెను.

వృష—ఓరీ! నీ ప్రపౌరుషంబులు పలుకుచుఁ బ్రయోగించిన బాణంబును నాబాణాగ్నిని బూడిదెఁగావించి నీరధిలోఁ గలిపితి. ఇదిగో నాశరము నీపాలి మృత్యువుగ వచ్చెను జూడుము.

ఘ॥ కో॥ నీదునారస మగ్నిఁజొచ్చుచు నీరధిన్ బడెభస్మమై
వాదులేలరే వాఁడివాలము వచ్చెఁజూడర మృత్యువై

బభ్రు— మీఁదుమించఁగ మాటలాడకు మిక్కుటంబుగ క్రూరమా
నాదుబాణము నిన్నుఁద్రుంచుచు నాకలోకముఁ జూపెడున్.

ఓరీ వృషకేతూ! నీవు వయోవంతుఁడవయినను నీపెద్దలు నీకు వివాహము సేయరైరి. చిన్నవాఁడయినను నేను నిన్ను నాకలోకమునకుఁ బంపి సురనారుల పొందొసఁగూర్చెద.

వృష-అశ్వగతివృత్తము:— "నిన్నిదెముంచును చూడర, నీరధినాశరమున్
మున్నుగ దానికిఁ గేలును, మోడ్పరదాసుఁడవై"

ఓరీ బభ్రువాహనా! ఇదిగో! నీపైబాతివచ్చెడి నాశరమును గాంచుము. దానికిఁ శరణాని కేలుమోడ్పుము. కాదేని నిన్నుఁగొనిపోయి వారి కాండమున ముంచివేయును.

బభ్రు—ఓరీ వృషకేతూ! నీకులము మాడ్కి నీబుద్ధినైన తమ హీనతఁ గనిన దని నాకుఁదోఁచెడు నీశరము.

" మిన్నును మన్నునుఁగానక, మీదనెభస్మమయ్యెన్
మిన్నక, తండ్రినిఁజేరర, మేనున నిల్వకికన్"

వృషకేతు—ఓరీ! నీయదృష్టమిఁకను గట్టిగనున్నది. కావున నేచావక నిలిచినావు. నీయాయువును దిగమ్రింగఁగల యీనాగనారాచము నీకనూ యార్గలములంటి నిన్ను యమపురిలో వదలి వచ్చును.

(అనుబంధము 32)

"మణిగణనికరవృత్తము" శరమిది ఘనమగు సరిఁగనఁ జనుమా
త్వరితము గనుగని తెఱఁగను లెనుకన్.

బభ్రు—ఓరీ! పరుషఁపుఁ బలుకులు నీకు ఫలమిచ్చునా? నీగురువు నీకు మాటలు నేర్పెనుగాని శస్త్రాస్త్రవిద్య నేర్పఁడాయెను.

పరుషఁపుఁ బలుకుల ఫలమగు నటరా
గరువము వదలుగ కదలక పడరా.

ఓరీ! కదమునకు నీవు నాకుఁ జాలవు. నీవిచటినుండి వెడలి యర్జునునిఁ బంపుము. అతని శరలాఘవమించుక చూచెద.

వృష—ఓరీ! బుద్ధిహీనా! పొగరు పలుకులు పలుకకు. నీయట్టి పసిబాలునిఁ బిలుకుమార్ప జగదేకవీరుఁడగు విజయుఁడు కావలయునా?

(అనుబంధము 33)

"నపనంది నీవృత్తము" యమమందిరంబునను నీతిథివై వనుమా
శ్రమమెద్దియున్ గనక శరము చేర్చునిన్

బభ్రు— క్రమమేదుమాటలకు గతము లేదిఁకనిన్
సమరంబునన్ దునుము శరము వేయుదునే.

ఓరీ! ఇఁకనిన్ను బ్రదుకనిచ్చిన నోటి క్రొవ్వు బలమగును. ఈ నారమున నిన్నుఁజంపెద.

"మేఘవిలసితవృత్తము" అయ్యారే! నినునరయఁగఁ గనిరేఁ
గయ్యంబందునఁ గలఁతును గనుమా!

వృష— ముయ్యేటంబడి మునుఁగఁగ నలువన్
నయ్యాటంబిది చనదుర యిఁకినున్.

బభ్రు—(స్వగతము.) నాతీక్ష్ణ బాణములన్నియు నీయోధునియందు రిత్త పోయెను. అయినను మఱియొక శరమును బ్రయోగించి చూచెద.

"స్రగ్ధరావృత్తము" అసుర నగరమును నంటింతున్
సుమనసతరుణులఁ జూపింతున్

వృష— • •సమరము నను, నిను, శాసింతున్
యముని విడిదికిని, నంపింతున్.

బభ్రు—"సమానీవృత్తము" మేనుఁ దూల్చు మానదురా
కానవేర కాండమురా

వృషకేతు— భూనభోంత రాళమునన్
బూనిగాంచి కాల్చునిను.

బభ్రు—ఏమిదియచ్చెరవు? అప్రతిమంబగు నా బాణము లెవ్వియు నియోధవరునియందు నిష్ప్రయోజకములయ్యెను. అచట నాసేన యర్జునుని శరధారలఁ గ్రుంగెనేమో? నానేర్చిన యస్త్రవిద్యచే వీనిఁ దుద ముట్టించెద.

(అనుచు బాణంబుఁబుచ్చుకొని మంత్రించి)

ఓరీవృషకేతూ! నీతలిదండ్రులను నీకుఁగావలసిన యాప్తబాంధవుల స్మరింపుము. ఇఁక నీపీయవనికి వెలియయ్యెదవు.

"శశివదనావృత్తము" అడిగను బాణం
విడిగను వచ్చెన్
పదునగు ధారన్
హృదయముఁ గ్రుచ్చున్.

(బాణంబు దవిలి వృషకేతు నేలఁబడును.)

నేనిచట నిఁకనాలసించిన నాసేనతాఱుమాఱై పటాపంచలుగఁ

బాఱును. వారిసాహాయ్యార్థము పోయెద. (వెడలును.) అర్జునుఁడు వచ్చి విగతాసుఁడై నేలఁబడిన వృషకేతునిఁ జూచి చింతించుచు.

అర్జునుఁడు—(స్వగతము) అయ్యో! నాబ్రదుకు నిరర్థకమయ్యెను.

సీ॥ నీముద్దు మోమునుఁ బ్రేమను జూచెడి తతిదూరమాయెరా తనయ! నేఁడు
అభిమన్యు పిమ్మట నంతయు నీవని మునమంది చెడితిరా ముద్దుతనయ
కులముద్ధరించెడి కొడుకు నీవను భూరి సంతోషమెల్లను సన్నగిలెర
వృషకేతు సమరూప, వృషకేతు, నాసిరి వృషయయ్యో రానీదు మృతికతమున.

గీ॥ తనయ! నీచావుఁ గని కుంతి, తనువు వదలు
ధర్మజాదులు నిలుపరు ధరను నీకను
సిద్ధమైనట్టి సవనము ఛిటినిఁ గలయు
పంచతనునొందుఁ బ్రాణిప్రపంచమెల్ల.

నాయనా! కుమారా! వీరాగ్రేసరుఁడవగు నీవా పితృకి బాలునకు నోడితివియా? వారి శరంబులకుఁ జిక్కి ప్రాణంబులు నీగితివియా! అయ్యో! నీమరణము మా బావయగు శ్రీకృష్ణునకు సమ్మతమాయెనా? నీపుండరీచో బాంధవుల సంగతి లేదుగదా? అక్కారణంబున గతియు లేదుగదా? నాయనా! నిన్నుఁ గన్నులారఁ గాంచక నాతల్లి కుంతి మనఁజాలునా? నీవు నను వెంబడించునపుడు మాతల్లి ననుఁ జేరంబిలిచి నిన్ను సహస్రాక్షులు గలిగి కాపాడుకొని రమ్మని పలికెనుగదా? ఆ వృద్ధమాతకు నీమరణవార్త నేనేమని తెలుపుదు. అయ్యో! మూఢులమై మాకు సోదరుఁడును నీకుఁ దండ్రియు నైన కర్ణుని రాజ్యలోభమున జంపితిమిగదా? ఇపుడు పంచపాండవులకు సద్గతి నిచ్చు కొమారుఁడు నీవొక్కఁడవని హెచ్చగు మోహమున నిను బాలించుచుంటిమిగదా? ఘోరమగు భారత యుద్ధమున నాగారాబు కొమారుని నభిమన్యునిఁ గోల్పోయిన దుఃఖంబు చాలక, తండ్రీ నీమరణ దుఃఖం బిమ్మడించి

నా మనః బాహుబాహ్యాత్రులు గాల్చునుగదా? నాయనా! మాకనుఁగవముంగిట నిన్నొక్కనినైన నుంపక దుర్దైవమగు విధి నానుండి నిన్నుఁబాపెనుగదా? నాయనా! లేచి నాతో నొకమాటయినను నాడఁగూడదా? మున్ను సవనాశ్వగ్రహణమున నీవు చూపిన పటుపరాక్రమమంతయు నాయన్న భీముఁడు ధర్మజుని యెదుట సదాకాలంబు పొగడుచుండునుగదా? అట్టిభీమునకు నీమరణవార్త నే నేమని దెలుపుదు? నాయనా! కన్నులేని మోమును లింగములేని దేవళము నమంగళకరమగునట్లు నీవు లేని పాండవుల బ్రదుకు వెతకుఁగారణ మగునుగదా? తండ్రీ! నీధైర్య శౌర్య పరాక్రమములనుండి కదా యౌవనాశ్వ హంసధ్వజాది సార్వభౌములు మాకు మిత్రులైరి. అట్టి నీవు నీ శరీరమును గృధ్రకాకంబులకు బలిగా నొప్పగించి రణమండలమున నన్నువదలి పోయితివియా?

(బభ్రువాహనుని ప్రవేశము.)

బభ్రు—ఏమండీ క్షత్రియోత్తములారా! చిత్రాంగదకుఁ గోమటివానివలనఁ గలిగిన సుతుఁడీ రణావనియను వీధిని బాణముల యంగడియుంచినాఁడు. ఈ వ్యాపారమున గెలుపే వానికి లాభము. మీ శూరవరుల శిరములనేకములు వాఁడు శరములను వెల నిచ్చికొనినాఁడు. కొందఱు వీరులు తమప్రాణముల నమ్మను వానినుండి శరములు గొన్ని నంచకరవుగఁ గొనినారు. ఆశూరవరుఁడగు బాలుని శిరమును రత్నమును గేలనిడికొని యేలగూర్చుంటిరి. వ్యాపారముఖమున నిగ్గేల? వణిగ్భవునకు సర్పించి దివ్యశరముఁగొనుఁడు.

గీ॥ వెలయ నాతల్లి చైత్యుని వలన నన్నుఁ
గనిన కతమున వీరుల కంఠములను
రత్నములుగొంటి నిచ్చట యత్నపడుచుఁ
బడయుమా నీదుశిర మిచ్చి పాశుపతము.

సార్వభౌములారా! మీ శిరమను రత్నమునకు వెలహెచ్చని తలఁచితి రేమో కదా? అటులెన్నకుఁడీ. బహుదినములుగ సాహసమను ధనము సంపాదించి యుంచినాను. నాసాహసమను ధనమును శరముఖంబునఁ బంపి మీ శిరమునుఁగొనియెదను. మీ చేతనుండెడి యుత్తమోత్తమ రత్నమును భవునకు సమర్పించి పాశుపతాస్త్రంబుఁ గొనినయెడ రెండు. వలదేని మీతలను వెలగనిచ్చి దానిని నేనుగొనియెద. లెండు. జంకవలదు. సవనాశ్వముఁ గోరితిరేని సంగ్రామమే దానినార్జించు సాధనము. అది వలదనిన మీరు వచ్చినదారి పట్టుకొని మరలిపోవుట మఱియొక సులభమార్గము. ఈ రెండు మార్గములలో మీరు దేని నపేక్షింతురో త్వరితముగఁ దెలియఁజేయుఁడు. వ్యాపారులకుఁ గాల విళంబము నష్టకరమగు మార్గము.

అర్జునుఁడు—(కోపమునఁ గనులెఱ్ఱఁజేసి) ఓరీ! పొగరుపోతా! ఇపుడే వచ్చి నీపొసరమడఁచెద. (అనుచు వృషకేతుని నెత్తికొనిపోయి మఱుగున నునిచి మరలివచ్చి.)

తాపవృ॥ ఆరె, నికడు పోసరమీ
కరవాలము ద్రుంచునిఁకన్
శరవాలముచే నిడను
శిరముల్ దగవేయుదుఁ జై.

స. స. స. గణములు.

నవమచ్ఛందము.

బ్ర. భు.— పారుష వృత్తము.
చెల్లవు చెల్లవు పలుకీ
ప్రల్లదముల్ ఫలముగునే?
పొల్లగు వాక్యములనిలోఁ
జెల్లునె పిరికి రేదుటన్.

భ. భ. స. గణములు

అర్జును— కుంతి వృత్తము.

మందిరమున నీమాతకనన్
సుందరతనువున్ జూపుమికన్
క్రందుననిలువన్ గావరమున్
గుందఁగఁ జచ్చెదున్ గుంతిమిదే.

భ. స. భ. గగణములు 7 యతి

బభ్రు— సాధన వృత్తము

పోగరాత్తురయీ పోరున నా
దగు పంథము చెన్నొఁగఁగన్
బగవాఁడగు నీబాహుబలం
బగలున్ గనుమా యాశుగమున్.

స. స. భ. గ 7 యతి

అర్జునుఁడు—ఓరీ! బాలకా! క్రొవ్విమాటలాడకు. పెద్దలయెడఁ జూపఁ దగిన మానమర్యాదల గమనింపుము. గర్వించి మాటలాడితివేని నీతనువుఁ జీల్చుబాణము వేయుదును.

అశుగవృత్తి— బభ్రు—

నిశితా, శుగము, న, నీతనువున్
శిశువా! చెదరఁగఁ జేయుఁడు నేన్
వశమే? పశుపతి, వచ్చిననీ
యశమార్తనుగను మాఁజపడిన్.

స. న. జ. లగ 8 యతి.

యోధవరా! నేను పతివ్రతాశిరోమణి సుతుఁడను. నాతల్లి దీవెన నన్ను భద్రముగఁ గాపాడును. నాతనువుఁ జీల్ప పశుపతి వశముకాదు.

అర్జు—ఓరీ! సీటులు గుఱుకుచుఁ బాటలాధరలబలె మాటలాడకు.

కంటిక వృత్తము—

పోటుల కోలమునన్
మాటలు బోలునెకే నీ
సీటులు చెల్లవు కో
కాటికిఁ గాకెడుదున్

భ. భ. గ

బభ్రు— శమన వృత్తము

సమరముఁ జేయుచునిన్
శమనుని మందిరమున్
గ్రమముగఁ జేర్చెద, నే
నమునను నుండుమికన్

స. జ. ల. గ. గణములు

సవ్యసాచీ! చక్కఁగ నిలిచి పోరొనర్పుము. ఈ తూరి నిన్ను శమనుని మందిరంబుఁ జేర్చెద.

అర్జు—ఓరీ! పితికీ! వైశ్యకుమారా! భీష్మద్రోణ కృపాశ్వత్థామాది వీరవరుల నాతోఁ బోరొనర్పఁ జాలరైరి నన్నుజయింప నీకునివశము కాదయ్యె. నిన్నుఁబోలు బాలుఁడా నాయెదుట నిలిచి యాలముఁ జేయసాహసించువాఁడు. ఇదిగో నీపొగరార్చెద. కొండనుఢీకొని సమేషము గతియేమగునది నీవు తెలియఁజాలవు.

(అనుబంధము 34)

ఉత్సాహ— వైశ్యజాతి తోడనాకు వాదమేల యింకనా
వశ్యకంబుగాననిన్ను వధ్యుఁగాను జేసెదన్
బభ్రు— దృశ్యమైన నీశరీర దేశమందు డాఁగుచున్
బశ్యతోహరుండుగాను ప్రాణముల్హరించెదన్.

అర్జునా! ఇఁక నీ తర్జనభర్జనలు చాలింపుము. అవి పనికిరావు.

అర్జు—చీ! మూర్ఖా! మాటలాడకు.

నజయవృత్తము.
నిలునిలు నిక్కుకురారా
పలునలఁ బోలకుపోరన్
కులమును గానని నీవీ
పలుకులు బల్కఁగ నానే
న. జ. య గణములు

బభ్రు—ఓరీ! అర్జునా! కులహీనుఁడ నేనని నీవు పలుమాఱు పలికితివి. ఈ కలనిలో నినుఁ జంపి నాకులము సాధించెద. చక్కఁగ నిలువుము.

సమ్మోహనవృత్తము.
కులమును నీకున్ దెల్పన్
కలనికి నేవచ్చితినీ
పలుకులు చాలింపుమనా
మాలుకుల లక్ష్యంబగునా.
స. య. స. గణములు.

(బాణంబువేయ నర్జునుఁడు మూర్ఛపోవును.)

(సమీపించిచూచి) ఈయోధవరుఁడు మూర్ఛలో మునిఁగెను. అప్పట నా నేఁగతి యేమయునదో చూచి వచ్చెద. (వెళ్లిపోవును.)

అర్జునుఁడు—(లేచి) ఆ యోధవరుఁడు బాలుఁడెచటికిఁ బోయెనోఁగదా? ఏమీ! ఎక్కటికయ్యమున నీశ్వరు నోర్చిన నేనీబాలుని గెలువఁజాల నైతిని. సరివారిలో నగుబాటయ్యెనుగదా? వీని శరజాల నైపుణ్య మెంతటిదియో నేఁ దెలియఁజాల. వీఁడు నిజముగా నొక మహాత్ముని కొమారుఁడేమో? కాదేని వీనికి నింతసామర్థ్యంబెచటినుండివచ్చును? వీఁడు నాకొమారుఁడని మున్నుపలికెనే. వీఁడెటు నాకు సుతుఁడయ్యెను? వీనితల్లి చిత్రాంగదయఁట. ఆస్త్రీ యెవతెయుండునొ? దాని పేరు సైతము నేవినియుండలేనే? ఇపుడు నేనేమిచేయుదును. నా సాహసమంతయు వెచ్చించి యీబాలుని గెలువకున్న లోకైకవిజయుఁడను నా నామంబునకుఁ గళంకంబువచ్చును. నాశస్త్రప్రయోగంబీ బాలునియందు సిద్ధింపదు. చిన్నపాము నైనను పెద్దకఱ్ఱచేఁగొట్టవలె ననురీతి నా నేర్చిన యస్త్రంబులుప్రయోగించి యీబాలుని నేలపైఁగెడపెదను గాని చంపను. ఆబాలుఁడు నేఁబడితినని నమ్మి తననేనఁ గలసియుండును. అచట నేపోయివానినిదాఁకెద.

[నిష్క్రమము]

# ఆఱవ రంగము.

(యుద్ధభూమి.)

బభ్రువాహనుఁడు, అర్జునుఁడు, ఉలూపి, చిత్రాంగద, శ్రీకృష్ణుఁడు,

అర్జు—ఓరీ! బాలకా! నేనైమఱచియుండు తఱి నీశరమొకటి నా శరీర ముఁదవిలిన కారణంబున నేనేలంబడిన నీవు గరువించి మాటలాడఁ జొచ్చితివి.

చ॥ అరెపరె వైశ్యబాల నినువాజినిఁ జంపెదఁ జూడుమింతలో
గరువము హెచ్చి నిక్కెదుర కావరమెల్ల నడంతుఁ గానరా!
గురుతర బాణజాలములకున్ గుఱిసేతుర నిన్ను నిప్పుడే
స్మరణకుఁ దెచ్చికోర కనిపాఁకిన తల్లిని మానసంబునన్.

బభ్రు—ఓరీ! క్రిందపడినను వెన్నుమన్నకాలేదను వైశ్యుఁడు నీయట్టి వాఁడు కాఁబోలు.

శా॥ పోరన్ బ్రాఁకిన నీకు నింతపొగరా పోపోర శ్రీకాంతునిన్
జేరన్ బిల్వర నీకు దోడుఁగను సచ్ఛ్రేయంబు ప్రాప్తిల్లురా!
ఘోరాజిన్ బటుశక్రమాధ్యుని నను న్గుందింపఁగా సాధ్యమే
శ్రీరామాపతికైన? మానుమిఁక శారీరాభిమానంబునున్.

అర్జు—(ఇంచుక యాకాశము దిక్కుఁ జూచి) ఓరీ! బభ్రువాహనా! ఈతూరి నా బాణంబున నిన్నుఁ గెడపెదను.

వృ॥ వీరక్షత్రియుఁడగుచున్
వీరాగ్రేసరుఁడగు నా
ఘోరాస్త్రంబున నడఁతున్
వీరస్వర్గముఁ గనరా.

(అనుచు బాణంబువేయ బభ్రువాహనుఁడు మూర్ఛపోయి పడును.)
(సమీపించి) హా! ఈ బాలుని సౌందర్యాకృతియెంత మనోహరంబుగ నున్నది. వీని ముద్దుమోముఁ జూచిన నేకఠినాత్ముని మానసమైనను గరఁగకపోవునా?

సీ॥ జిగియడుగులు చూడఁ జిగురులనగియొండి నడుము చూడఁగ లేదు పిడికెఁడైన
మోము చందము చందమామయందము మాఱ్చ్చ నురాగరాగమా కోరమోవి
అఱవోడ్పుఁ గన్నులే యరవిందములఁ గెల్చు నళినెలకెల్చనా కొనదురు
చికిలి చెక్కుల చెన్ను చెలువుఁ జంద్రికకాంతి చపలాలతా నిభచ్ఛాయ మేను,

గీ॥ నవనవంబులు క్రీనిధులైన లయారె
నవన మొనరింప నఘనార నానచెలువు
నరుచిగళీమున కెంతటి తరముదరిము
మల్లెమొగ్గలచాలు పోపల్లవరుస.

ఇట్టి సౌభాగ్య లక్షణాకారునిఁగనిన తల్లిభాగ్యమే భాగ్యము. అయ్యో! ఆహా! మాత తనసుతుఁడు నేలఁబడెనని వినినఁ దోడన యెంతగఁ జింతించునో? ఎంతగ విలపించునో? నన్నదూషించునో? శపించునో? నేనేమిసేయుదును? వీరాహవమునఁ గ్రౌర్యావేశంబు సహజముగదా? ఇపుడీ బాలునకునై నేనెంతగ సంగలార్చిన నేమిప్రయోజనము? (బాలునినంటి) ఈపసికూనకు నిఁకనునుసున్నది. ఇదిమూర్ఛగాఁ బోలు. నెమ్మదిగఁబడియుండ నిమ్ము నాసేఁగతియేమయినదో చూచి వచ్చెద. (వెళ్లిపోవును.)

బభ్రు—(మూర్ఛనుండి తెప్పరిలి లేచి నలుదిక్కులఁజూచి దూరంబున నొక స్త్రీరూపు నీడనుఁజూచుచు నచ్చెరువంది నిలుచును.)

(స్త్రీరూపమున నున్నవిగ్రహము.)

ఓరీ! బాలకా! బభ్రువాహనా! భీభత్సునకు నీవు భయపడకు. ఘోరతపంబొనర్చి మేనుఁద్యజించి యానరుని శిరముఁ దెగవేయఁగల శరరూపమును దాల్చి నీతూణీరమున డాగినాను. నాపేరు జ్వాలకావున నాశరము పేరును జ్వాలయనంబడును. నీవు భీతిల్లక నీమాతకు మానసాభివందనమొనర్చి భక్తిచే శరమునకు నమస్కరించి నరునిపైఁ బ్రయోగించితివేని నాశరము నరుని శిరము దునుమును. ఇదినిజము ముమ్మాటికి నిజము.

(ఛాయావిగ్రహ మదృశ్యమగును.)

బభ్రు—ఏమియచ్చెరువిది? ఇంతటి కష్టకాలంబున నాకీ ఛాయావిగ్రహము తోడ్పడెను. దైవానుకూలమనిన నిట్టిదియకాదా? ఇట్టి మంచి సమయమును నేఁబోఁగొట్టుకొనరాదు. ఈ శరసాహాయ్యమున నాసవ్యసాచిపై నాసాహసముఁ జూపెద. ఇపుడే నాతల్లికి నభివందనంబులర్పించెద. (అనుచునమస్కరించుట నటించును.)

(అర్జునుని ప్రవేశము.)

అర్జునుఁడు—ఓరీ! కులహీనా! బ్రదికితినని బొబ్బలిడకుము. నీకవసానకాలమాసన్నమాయెను కావుననే యంతగ మిడిసి పడియెదవు. బాలుఁడవని కనికరించి నినుఁజంపనైతిని. ఈతూరి నిన్నువదలను.

బభ్రు—ఓరీ! అర్జునా! నేనాడఁదగినమాటలు నీవాడితివి. మంచిది. ఈగడియనే నీయాయుఃపరిమితి గడచును. నీదైవమును దలంచుకొనుట కించుక కాలము నీకుఁగనువిచ్చినాను.

(అనుచుఁగేలు మోడ్చియాకాశము దిక్కుఁజూచి)

(అనుబంధము 35)

ఉ॥ పావనమూర్తిగా వెలయు పార్థుని దారఁగ నాదుతల్లి తా
భావమునందు నెల్లప్పుడు పాండవ మధ్యము, భక్తియుక్తి నిజ
దైవముఁ గాఁగ నెన్నుచును దారపతివ్రత యయ్యెనేని నీ
పావకబాణమిత్తఱినిఁ బార్థునికంఠముఁ ద్రుంచుఁగావుతన్.

(అనుచు బాణమువేయ పార్థుని శిరము ఖండమయి దూరమునఁబడును.)

బభ్రు—(కంఠవిహీనుఁడగు నర్జునింజూచి చింతించుచు) హా! హా! నేనెంత పాతకిని. నేనెంతటి పాపకర్మంబొనర్చితి. అయ్యో! నాజననకారణభూతుఁడగు పార్థుని నాతండ్రిని నాచేతులారఁ జంపితినిఁగదా? ఇంత

కంటె ఘోరకల్మషంబు వేఱొకటికలదా? నాయనా! ఒక్కనాఁడయి నను నినుఁజేరి సమస్కరించి దీవెనలందు సౌభాగ్యము నేఁగననైతిని గదా? తండ్రీ! సమస్తవిద్యా ప్రవీణుఁడవయి, సకలనీతికోవిదుఁడవయి, అప్రతిమదివ్య శస్త్రాస్త్రనిపుణుఁడవయి జగదేకవీరుఁడవగు నీవు మున్నే నాతల్లిని చిత్రాంగదను పాణిగ్రహణ మొనర్చిన శుభోదంతం బెట్లు మఱచితివి? నీవు నాతల్లి సరసనుండు సమయముననే, నేఁబుట్టితినఁట. అవ్వార్తస్మరణకు రానికారణంబేమి? నాయనా! నిన్ను నేను దర్శించినపుడు నీతో యుద్ధమాడనని నిరాకరించియుండిన బాగుఁగనుండెనుగదా? కాక, నన్నుఁ దిట్టికొట్టి యుండిన నంతకంటె మేలుగ నుండెనుగదా! అయ్యో! పతివ్రతా శిరోమణియగు నామాతను పునీతను వ్యభిచారిణియని యేలదూషించితివి? అయ్యో! నీవు దూషించిన మాత్రాన, నాతండ్రియేమయిన ననుకొనని మ్మని శాంతివహింపక, నేనేలయాగ్రహపరవశుఁడనైతిని? కోపావేశుఁడనైన తఱి నాతల్లి ననుఁజేరి తనయా! తండ్రిపై విరుద్ధముఁ బెంచితగవ్వానుట ధర్మంబు కాదని పలికెనుగదా? నాపెత్తల్లి యేల నన్ను యుద్ధమునకుఁ బ్రేరేచెనో? ప్రేరేచెనుపో స్త్రీబుద్ధి వినుట తగదని యెఱ్ఱక నేనేల యామె దుస్తంత్రమునకు లోనైతిని. ఇంతకు నాపెత్తల్లి యులూపి యీ మహానుభావుని భార్యయకదా? పెనిమిటిపై నామెకేల యింతటి దుర్బుద్ధి పుట్టియుండును? అయ్యో! ఎన్నియనర్థములకు నేఁగారణభూతుఁడనైతిని. నేఁబుట్టి నాకులమునకే కళంకము దెచ్చితినిగదా? ఈ నా తండ్రి మరణవార్తవిని నాతల్లి విధవాత్వమునగుందుచుఁ జితిఁజేరునేమోగదా? నాపెత్తండ్రి పినతండ్రులెంత తపింతురో? ఆవృద్ధమాత కుంతి పుత్రశోకాగ్నిలోఁ బడికాలి పోవునేమో? అకటా! నాపెత్తండ్రి పూనిన యజ్ఞ దీక్ష నావలనఁ జెడెనుగదా? నేనేమిసేయుదు? శ్వేతవా

హానుని రక్షింపఁ బాండవపక్షపాతియగు గరుడవాహనుఁడు సదాకాలంబు వెంబడించియుండునని కదా జగత్ప్రసిద్ధి? అట్టి రమాపతి నేఁడేల నాతండ్రిని రక్షింప సమీపింపఁడు? నాతల్లి వచ్చి తన పతినిఁ జూపుమని నన్నడిగిన నే నీశవము నెటుచూపుదు? దైవమా! దిక్కుఁగాని ద్రోహిని నన్నెటుల యీదుఃఖమునుండి తొలఁగించెదవో?

(అనుబంధము 36)

(అనుచుఁ జింతించు చుండును.)

(ఉలూపి, చిత్రాంగదల ప్రవేశము.)

(అనుబంధము 37)

చిత్రాంగద—(అర్జునునిపైఁబడి) హా! ప్రాణనాథా! నన్నువదలిపోయితే! నాథా! నీవు నాసరసలేనితఱి నాకంఠ భూషణముగనుండు మాంగల్యమే నాకు సర్వకాల శుభకరమని యెంచి దానినిఁ బూజించుచుంటినిగదా? ఈ నిర్భాగ్య కాసౌభాగ్యమైన నేలయుండవలెనని దానిని నానుండి బాపితివియా? నే నన్నివిధములఁ జెడితిని. నాజన్మమే వ్యర్థమయ్యెను. (బభ్రువాహనునిఁజూచి) ఓరీ! కులపాంసనా! కుమారా! నీకార్యంబతి శ్లాఘనీయము. పితృహంతకుఁడవైతివి. నీకీర్తి దశదిశల వ్యాపించును. నినుఁగని పెంచి పెద్దఁజేసిన నీతల్లికి, వీనుల కమ్మలు, కంఠమాంగల్యము, మంగళకరమగు కుంకుమ పసుపు గంధమాల్యాదులు బరువని యెంచి కాఁబోలు వానిచెఱనుండిముక్తను జేసితివి. సుపుత్రుఁడవైతివి. కొడుకు మరణము విని కుంతి బ్రదుకునా? తమ్ముని మరణము విని ధర్మజుఁడు మనునా? భీముఁడు జీవించునా? తమ్ములగు నకుల సహదేవులు ప్రాణాన నిలుతురా? పతివ్రతాశిరోమణియగు నావదినె ద్రౌపది ధరనిలుచునా? ఉభయకులములు

నీవలనఁ బాడాయెను. హేయమగు నీ పౌరుషమజేయుఁడగు విజయుని నీతండ్రినిఁ జంపుటయందు వినియోగించితివియా? (అర్జునునిఁ జూచి) ప్రాణనాథా! రూపగుణ శూరత్వ సాహస ప్రౌఢిమను నీకు సమాను లేరు నీధరను లేరనికదా ప్రసిద్ధి. అట్టివాఁడవు నీ వీ శిశువుచేఁజిక్కితి వియా? భర్త విహీనసనై వైధవ్యమనుభవించుచు నేనీ వసుధమని యుండఁజాల. తనయా! నీమాతాపితృల సంస్కారణార్థంబు జితిఁజే ర్పుము. ఆలస్యమేల? మా యనంతరము నీవు సుఖమున నుందువు గాత. దానికి నీవు సమ్మతింపవేని, పూర్వమునఁ బరశురాముఁడు తన తల్లిని గృపాణముచేఁ డెగనఱికిన విధమున నన్నుఁదెగనఱకుము.

బభ్రు—అమ్మా! నావిధికి నే నేమిసేయఁగలను? నీ కంటెను నాకువేయి మడుంగులు దుఃఖము పెచ్చుపెరిగినది. నేనీపాపిక ళేబరమునుంచికొని మనఁజాలను. ఈ నానీచదేహమును నగ్నిముఖమునఁ బరిహరించెద. తండ్రినిఁజంపి సుఖమున మనెడునెడియపవాదము కంటెను దండ్రినిఁ జంపిన దోషంబునఁ దనదేహంబగ్నిముఖంబునఁ గాల్చెననుకీర్తియైనను రానిమ్ము.

ఉలూపి—నాయనా! బభ్రువాహనా! ప్రాణత్యాగమునకు సాహసింపకు. పాతాళలోకమున నాతండ్రిసరస మృత సంజీవక మణియున్నది. దానిని మనము దెచ్చితిమేని నర్జునుఁడు బ్రతుకును. ఈ ఫల్గునుని శరీరము భద్రముగ రక్షింప నీ సేనను నిటనుంపుము. చిత్రాంగదయు నిచటనే యుండనిమ్ము.

బభ్రు—అమ్మా! నాతండ్రిని బ్రదికింతువనిన నేనెంతటి సాహసమునైనఁ జేయసమర్థుఁడను.

ఉలూపి—అట్లైన నా వెంటరమ్ము.

[నిష్క్రమణము.]

# పదవ రంగము.



(యుద్ధభూమి.)

(అర్జున,చిత్రాంగద,ఉలూపి,బభ్రువాహన,శ్రీహరి,దుర్బుద్ధి,దుస్స్వభావుఁడు)

దుర్బుద్ధి—(తమ్ముఁడగు దుస్స్వభావునిఁజూచి) తమ్ముఁడా! మాతండ్రి యగు ధృతరాష్ట్రుఁడు పలికిన నరుఁడు వీఁడేను. వీనినిఁ గాచికొని యెవతెయో యొకయీాడుదున్నది.

దుస్స్వభా—అన్నా! దూరమున సేనయున్నది. ఇంతన నెవరు లేచినను మనబ్రదుకు తెల్లవాఱును.

దుర్బుద్ధి—కావున మనము మనమాయాబలంబున నదృశ్యరూపముదాల్చి యిచటఁ బడియున్న నరుని శిరమునెత్తుకొని పోవలయును.

దుస్స్వభా—అన్నా! దానినిఁ దీసికొనిపోయి మనమెచట డాఁపవలెను.

దుర్బుద్ధి—మనము వచ్చుదారిని బక దాల్భ్యముని నివసించు మహారణ్య మున్నది. ఆముని యాశ్రమంబున దీనిని దాఁచుదము.

దుస్స్వభా—మంచియాలోచన యిది. ఋష్యాశ్రమము కావున నందెవరును వెదుకఁబోవరు. అటుగాన మనపని మనము సేయుదము.

(అదృశ్యరూపము వహించి అర్జునుని శిరము దొంగలించుకొని దృశ్యరూపమునవచ్చి సంతసింతురు.

(అనుబంధము 38)

(అనుచు నటించుచు వెళ్లుదురు.)

(ఉలూపి బభ్రువాహనుల ప్రవేశము.)

ఉలూపి—(అర్జునునిఁజూచి తలఁగానక) చిత్రాంగదా! మన ప్రాణనాథుని శిరమేది? మేము చనునపుడిచటనే యుండెనే?

చిత్రా—(చూచి) అక్కా! కంటిరెప్పవేయకనేఁ గాచియున్నాను. ఇచటికి నెవరు నల్లాడలేదు.

ఉలూపి—(చింతించుచు) నాయనా! నీసాహసమంతయు వ్యర్థమయ్యెను. నాగులతో ఘోర రణంబొనర్చి నీవుసాధించుకొని వచ్చిన మృత సంజీవకమణి యనుపయుక్తమయ్యెను. నీతండ్రి శిర మేదానవుల పాలాయెనో, యేమాయావులచేతఁ బడెనో తెలియదయ్యె. శిరములేనిదో నరుని బ్రదికించు విధమెద్ది? నాకేమియుఁదోఁపకయున్నది. సర్వ సంకట పరిహారియగు శ్రీహరియొక్కఁడేమనకు దిక్కు కావున ఆరమానాథుని నిష్కపటమానసంబున భజింపుము. అతఁడుభక్తసులభుఁడు.

బభ్రు—తల్లీ! నీయాజ్ఞానువర్తిని నేను. నీచేఁజలుకంబడిన దైవమును నేనిపుడు భజించెద.

పంచచా॥ నిరంజనా, నిరంతరా, నిరస్తదోషసంచయా!
నిరాశిషా, నిరాకృతీ, నిరామయా, నిరంకుశా!
హరాజ వందితాఘనా, హరీనినున్ స్మరింతునే
సురేంద్ర సౌఖ్యదాత, భూసురాది సజ్జనస్తుతా!

ఉ॥ దీన నవీనవాహన, పవిత్ర చరిత్ర, రమారమా, హరీ!
దానవదాన, దీనజనతా ఘనకామితదాన శ్రీహరీ!
మానిజనావనా, మహితమానధనా, మహితానుబోధనా!
మానసమాన, నిల్వవె, రమాధవ, మాధవ నిన్నునమ్మితిన్.

(అనుబంధము 39)

(శ్రీహరిప్రవేశము.)

శ్రీహరి—బభ్రువాహనా! నీవు నన్నుఁదలఁచిన కార్యంబు నేఁదెలిసితి. నీతండ్రి యర్జునుని శిరంబు దుర్బుద్ధి దుస్స్వభావులను ధృతరాష్ట్రుని కొమారులు దొంగలించుకొనిపోయి దాఁచినారు. వారు మాయాబలంబున మించినవారు కావున మీకసాధ్యులు. ఇదిగో నా కరమున భాసిల్లు చక్రమంపి శిరముదెప్పించెద. మాటలకు గాలంబులేదు.

ఉ॥ భూరినిశాటకోటి మదకుంజర కుంభవిపాట నోద్యమం
బారసి సంచరించెడి కరాంచిత చక్రమృగేంద్రరాజమా!
ధారుణిఁగీ్రిడి గ్రీవమును దాఁచిన ద్రోహులఁగుర్రించి నీవు వేఁ
పారక పార్థకంఠమును, జయ్యనఁదెమ్ము ముదర్ధముంపుమా.

(పై నుండి శిరము వచ్చును.)

బభ్రువాహనా! నీ అదృష్ట వశమున యిదిగో నీతండ్రి శిరంబు. దీనిని నీతండ్రి మొండెమునకు జంటించి నీవార్జించి తెచ్చిన మృతసంజీవకమణిచే స్పృశింపుము. త్వరగా పొమ్ము.

బభ్రు—(అర్జుని కళేబరమునకు శిరము నతికించి మణితో సంటును. అర్జునుఁడు లేచి కూర్చొని నలుదిక్కులఁ జూచి శ్రీహరికి నమస్కరించి.)

పంచ చామరము॥ దినాధినాథ, దివ్యతేజ, దీనలోకపోషణా!
యనాది దేవదేవ, వీనయాన, దాసతోషణా!
యనూనపూజనీయదేహ, యాగసైకభూషణా!
సనాతనాభిధర్మశీల చారుసత్యభాషణా!

(పునర్వందనంబు లాచరించి)

రమాపతీ! శ్రీహరీ! అనాథరక్షకా! పాండవపక్షపాతిని నీవటంచు నీకుంగల బిరుదు కాపాడికొనక నేఁడేల నీదాసుని నుపేక్షించితివి. నేఁజేసిన దోషమేమి?

కృష్ణుడు—అర్జునా! నీవు కృతార్థుఁడవైతివి. చింతించెదవేల? భారతరణంబున భీష్మాది మహావీరులను, నేఁజంపితినని నెడి గర్వంబు నీయందం

కురించి యుండెను. నా భక్తులరిషడ్వర్గంబులకుఁ జిక్కిన తఱి దానిం బోకార్ప నేను యత్నించుచుండెద. ఇపుడు నీకు గర్వభంగంబాయెను కావున నీవు ధన్యుఁడవైతివి. అర్జునా! నేవచ్చినపని యయినది. కావున నేఁబోయి వచ్చెద. ఈ,నీకుమారునిం గూడి సుఖముగ నింద్రప్రస్థపురంబుఁజేరి నీయగ్రజుని యశ్వమేధంబు సమాప్తినొందింపుము.

(అందఱు శ్రీహరికి నమస్కరింతురు.)

అర్జునుఁడు—(ఉలూపి చిత్రాంగదలను జూచి) భామాశిరోమణులారా! మిముఁ జూడక బహుకాలంబయ్యెను. మిముఁజూచువఱకును నీచిత్రాంగద నాభార్యయను విషయమే నేమఱచియుంటిని. కారణమేమో తెలియదు.

ఉలూపి—ప్రాణనాథా! నీసుతునిచే నీకు మృతిగలుగునటుల లోకపావనయగు గంగశాపమిడెను. ఆశాపంబష్టవసువులు స్థిరపరచిరి. భారతరణంబున నీకుసంభవిల్లిన పాతకము పరలోకంబున నినుబాధింపనటుల యీ లోకంబుననే నీవు మృతుఁడవై బ్రదికితివి. జాహ్నవీశాపవశంబున నీవు చిత్రాంగదను బెండ్లియాడి సుతునిగనినవార్త మఱచితివి. నీమఱపు నీదుర్మరణంబునకుఁగారణంబయ్యె. ఇంతటినుండి శుభంబగు. తండ్రియగు నిన్నువధించిన కారణంబున యీ నీకుమారుఁడు దుఃఖించుచున్నవాఁడు. కోపావేశంబున నిన్నుజంపి పశ్చాత్తప్తుఁడై పాతాళలోకంబుఁజేరి మృతసంజీవకమణి సాధించి తన్మహిమచే వృషకేతు మొదలైనవారిని జీవింపంజేసి నిన్ను బ్రదికించెను. కావున వీనిని మన్నించి దీవనలిమ్ము.

అర్జునుఁడు—(బభ్రువాహనుని కౌఁగిలించు కొనును.)

(అనుబంధము 40)

# అనుబంధము. (Appendix.)

సూత్రధారుఁడు.—1. ఝుంఝూటి రాగము - ఆదితాళము.

మాధవాహారీ మనంబునను నినుదలతూ ॥మా॥పల్లవి
మదినెంతును మానితముగనూ ॥మాధవా॥అను
మానమూనకా సాదారా మనము ననుఁజేరా
మదినెన్ను చుండెదర్ గనా ॥మాధ॥

అర్జున—2. ( అనుబంధము )

విజయ వరద విభుల గెల్చిచుర్ విభవము నాగ్జింతు ॥పల్లవి॥
భూతేశుసీశు గొలిచి భవ్యాస్త్రమంది గెలిచి
భీష్మార్యు భీతివిడిచి నా కేశుగర్వ మణచి
వినుతుడగు విజయుడను వెడలెదను॥

నీలధ్వజుఁడు—3. కానడ రాగము - ఆదితాళము.

వలదిట్టిహయము బంధింపా - ఘనవేణిదీని వదలెదర్ ॥పల్లవి॥
అర్జునుహయమును నాపుటసులభము మానెద నేఁమతమున్ ॥వలదిట్టి॥

జ్వాలాదేవి—4. బ్యాంసురాగము - ఆదితాళము.

చూపెదనేనాసాహసమున్ మదిముదములరగ నామనమునకున్
భూరిశరంబుల నిపుడే గూల్చెదనే శత్రువులన్ ॥చూపెద॥
దండధరుండె వచ్చైనన్ - ఖండనమందున గూల్తున్ ॥చూపెద॥

నావికులు—5. హిందూస్థాని రాగము - ఏకతాళము.

మానరివారెనిగానము నడపరయింక నుసుపము
గడియకు నామడపోదుము ఒడయుని మెప్పనందుదము ॥౧॥

ఏరినయలలల వెక్కుదము జారుచు దూరము పోవుదము॥౨॥
గాలికి వానకు వెఱవము ఏలినవాని మఱవము ॥3॥

6. నాథనామక్రియరాగము - ఆదితాళము.

ప్రభావతి—కాముని బాధకు కాయము సోలేనహా ॥కా॥
కంతుకేళీల - దేలా - కాంతుని గలశేదా ॥కా॥
నాదుప్రియుడు నేడు విజయు - నెదుర్పను
బోవునని విని భీతిజనించెక ॥కాముని॥

7. హిందూస్తాని తోడిరాగము - ఏకతాళము.

ప్రభావతి—మదనా మోహనా సమారూపా వేగరారా
సమరూపా వేగరారా ॥మద ॥పల్లవి॥
మశీజ బాణా హతులకు దాళా - మద॥౧॥
తాళతాపము - తడయక వేగరారా - మద॥౨॥

8. పీలురాగము - ఛాప్ తాళము.

శాంతమతి—గతియేమి యెరుగాను మతిహీననై తీనె
పథము కాననైతి గతినీవే హా కృష్ణా ॥౧॥
పతికోపమూనేను బాలూనిపై చాలా
కననైతిదారి శ్రీ పతిపాలించుమన్ను ॥గతి॥౨॥
సుతునీ వీడినేను భువిమాన జాలానె
కనికరముసపుత్రు కావుమ శ్రీహరి ॥గతి ॥3॥

9. మాలకంస్ రాగము - ఆదితాళము.

వృషకేతు—పంపుమ తండ్రి బవరమునకు ననువేగా ॥పల్ల॥
పోరున ఆరినీ కారియ నిడినే శూరుడ నగుదు ధారణి నీ ॥పల్ల॥

అగ్గలముగాను నెగ్గాల మడరా అరులగెల్చివత్తు నేను ॥అనుపల్లవి॥
అతను శరధార వేసూల నీవుజూడ మరిముదమందగ సలువ్రాసును
వేసెదా నిను అనికిపోవ అరాతిరాచి నిరాసు ప్రాల బి సచేతు కను
మర్కదయా వినుమా వేసెదా వేగసనుప వేసునాడ ॥పల్ల॥

10. హిందూస్తాని తోడిరాగము - ఏకతాళము.

వృష.కేతు—బవరమొనర్పుమురా భయము వీడి॥బవ॥
బాలకుడంచని పలుకుట తగదూ ॥బవ॥
కావరముసుగుమ కార్ముకమిడెగను
కారుకూతలిక కూయకునీవు
నామశరంబుల నాలుకగోయుసు ॥బవ॥

సుధన్వ—విసిలశరంబులు నింపెదనీపై యసువులార్చునిక నేలమోపెగెదవు
ఇటనిల్వకురా వెడలుమవెగమె ॥౧॥
బాలక మానుమురా రణమునీవు ॥బా॥

11. మాలకంస్ రాగము - ఏకతాళము.

అర్జున—క్రూర నీదు పొగురార్చ శూరుడగుదుగా
ఆహవమ్ము సల్పినిను యసురార్తు జూడుమదె
ధరలోన నాదు సరివారిలేదుజూడగ ॥క్రూర॥

సుధన్వ—నోరుకుల్ల మాటలిక చాలువలదు
నామశరము చేతనీదు నాలుకాను చీల్చెదగ
ధరలోన నాదు సరివారు సన్నుమెచ్చగ ॥నోరు॥

అర్జున—కఠినశరా కాండంబులచే నా
బలమున నిను నే దురమునగెడపి
పేరుధరా గాంచెదా నేలెదా నేసదా ద్రోసెదా గాంచుమిక ॥క్రూర॥

సుధన్వ—పొగురు క్రూతలను క్రూయకురా
రణరంగమున నాదుబలమగు శరముచే
నిన్ను నేను గూల్చెదా చీల్చెదా ద్రోసెదా నేనరిఁ బొసెదా
గాంచుమిక ॥నోరు॥

(44-వ పేజీలో అర్జునుడు "ఈ నా బాణమున నీకుత్తుకఁ దఱిగెదఁ జూడుము" అనినతోడనే 12 అనుబంధము పాటపాడవలెను.)

12. అనుబంధము.

మాండ్ రాగము - ఆదితాళము.

అర్జున—రారా క్రూరా పాపవిచారా పోరంజేర దరామేరా
వారక నిరుపనినసుధ గెడుపుమును తెలియర పదరా వలాముఠా॥

సుధన్వ---పోరా క్రూరా పాపవిచార పోరుచునిల్వర దురంబునా
క్రూరశరంబుల గూల్చెద నినునే కూయకరణమున నిలువుమురా॥

అర్జు ---నిదానమూనరా పదారికవిక్రమ
మదంబుమాన్పినే ముదంబుగంచురా

సుధన్వ—పరాధమూనిన్ కృతాంతునిపుఁడ
జేరజేసెదన్ మదంబు మానరా

అర్జున—అనిగూల్తున్ - విదరోరి

సుధన్వ—పొగురార్తున్ - ధరగూల్తున్ ॥౨॥

13. అనుబంధము.

బేగడరాగము - రూపకతాళము.

ప్రమీల:---అందము యీతరు బృందము శోభిలె ।
నావనందనంబుపోలె - భాసిలెమిగులగ ॥అం॥౧॥

కలనాదా - కలనాదా - వళిమోదా - స్వదకాదా ।
శాలరసాలము చిగురులరుచిగరుగొనిమెద ॥అం॥౨॥

14. భీమపలాస్‌రాగము - ఏకతాళము.

సఖులు—జయజయ మహారాణి జయనుత గుణవాణి
జయజయ మృదుపాణి దీనజన పోషిణి ॥పల్లవి॥
జయజయ శుభశీల జయరిపు హారిణి
జయజయ నాగవేణి జయమృదులాంఘ్రిణి ॥౧॥

15. ఇంగ్లీషునోటు - ఆది తాళము.

సఖులు:---ఓ! మహారాణీ - మనోహరవాణీ - మనసిజరాణీ మనామునా ।
ఘనమానందమాయె - మనోహరీ ।
మందయానా - ఇందువదనా - కుందరదనాచందిరా ।
అందమలరా - సందమొందవా - సుందరీ ప్రియమొందువా ।
మందేభగామిని - మనోజమోహిని -
వినోదభాషిణి - విలాసవాహిని ।
చూచుమనను - చేరుమచెలి - రమ్మానడిగను ।
కొమ్మానతులను రారా॥పల్ల॥

16. మాలకంస్‌రాగము - త్రిశ్రగతితాళము.

ప్రమీల—విమల కమల రావెవనము జేరా
సఖులు—సంతోసము గల్గెమనము విమల॥
ప్రమీల—రావెచెలీ రావెసఖి రావెచెలివేగా
రావెచెలీ రావెసఖి రావెఅలమయూరి ॥విమ॥
విమల కమల రావె వనము జేరా

సఖులు—సంతాపము గల్గెమనము విమల॥

17. ఝంఝూటిరాగము - ఏకతాళము.

విసీల, విశాల, స్త్రీలు.

వీనిచూచితే - మీనకేతనూడు ॥వీని॥
మదిసోలుగాదె - యీశశి
వదనూ గనిసంత ॥వీనిచూ॥
ఇంతి జయంతు మీరునె కంతుగేరునె
యీ వింత నెంతనెంతు ॥వీనిచూచితే॥

18. పీలురాగము - ఆదితాళము.

విశ్వేశ్వరవధాని—కాంతలార మీరిరువురు సన్నిటువంతల పాలుజేయుదురె॥
ఎంతవేడినా చెయ్యివదలరె చేరిమొక్కెదను నేగావరె॥

స్త్రీలు—మాయకారి భూమిసురా మమ్మునూని పోదురా
రాయిమనసు సేసిసేసి రాగమెల్ల మాసిమాసి
కాయమట్లు రోసిరోసి గాశికల్గ పోదురా

విశ్వేశ్వర—ముసలి తనముచే మూలుగునాపై మోహమెట్లు కలిగనెమీకు
మసలింపకుడో మానినులారా మనికిడిదయచే తనుమీరు॥

స్త్రీలు—ఇద్దరాంధ్రునేలు నీవు వృద్ధుడెన్నకును గావు
ముద్దులన్ని యిచ్చియిచ్చి కౌగిటాలు గుచ్చిగుచ్చి
బుద్ధిమీర మెచ్చి మెచ్చి పోదుగానిపోవ నేపు

విశ్వేశ్వర—అయ్యొ అయ్యొ మీరిటు నాపాలిటి దయ్యాలై పోతిరిగదరె
కయ్యలుంచి నా చేయి విడువరె చేరిమొక్కెదను పోవదనే.

19. ఝుంఝూటి రాగము—ఏకతాళము.

విశ్వేశ్వర—లాగగా వలదూ

స్త్రీలు—వదలము మేము

విశ్వేశ్వర—వదలుమవే

స్త్రీలు—వడిరారా

విశ్వేశ్వర—పోవెదూరాము నావీడిసన్నా యికా మిము వేడేదసుం

స్త్రీలు—వడిగ వెళ్ళుమ తడ యకీపుమానమూ నినూ

20. ఝుంఝూటి రాగము—ఏకతాళము.

సఖులు:—ధరాధిపాల శీలమాను మిందూ

వరతరుజాలా ములలీలా కనుజాలా వరలోలా ॥ధరా॥

ప్రమీల:— శుకశారిక కేకి ప్రకురకృతా

మధురగాన సంభరితమై ప్రకటా

నందకరంబై తనరెగాదె యీవసంబిదె.

21 అనుబంధము.

ప్రమీల:---ఓరీ! ఓరి! నిలుమా - రణమూనా।

నాదుబలమును - కనుమా ॥ప॥

తడయకనిపుడె - నీదుశిరమూను।

చీల్చెదను - చూడుమిక ఓ శూరవర ॥ఓరి॥

22. కల్యాణి రాగము—చాపుతాళము.

అర్జు—కంజాయతాక్షిని కనిథన్యుడై తిని

కనెమోదమూ మనమూ ॥పల్ల॥

మదిరాక్షి నేజూచి మదిమోహ మడరెను
మానూపు నేనొల్లు మగువాను విడనాడి ॥౧॥

23. మాండ్ రాగము—ఏకతాళము.

అర్జున—మానిని నీవిటు పల్కకు నీ పొగురార్తుగా ధరగా గూల్తుగా ॥మా॥
ప్రమీల—హెచ్చుగ మాటల నాడకురా ఆనిగా గూల్తుగా వినరోరి ॥హె॥
అర్జున—వాదమేల వలదిటుపల్క వనితరో వేగమె వెళ్లుమ
ప్రమీల—పోరున నిన్నుగా గూలగజేసి వెడలెద యుద్ధమునుగా నీడి
అర్జున—శశిముఖి నాశరములచె నినుజంపెదా నిది నిక్కాము
ప్రమీల—నీపొగురార్తు నినుబంధింతుగా నిను దండింతుగా శిరమునమూన
అర్జున—బవరమొనర్పుమ భామిని నిన్నునె బాణంబుల కాహుతి జేతుగా
ప్రమీల—కరముననిల్వుమ తరిగెదశిరమును తడయక నాశరధారలచేగా ॥

24. కమాజు రాగము—ఏకతాళము.

ప్రమీల—మానవ నీవిటు పలుకకు చాలు
ప్రాణము లార్చెడు బాణము గనుమా ॥మా॥
అర్జున—కనుమా యీకాండము నీవు
కంఠంబుఁ ద్రుంచును గనుమా
ప్రమీల—చాలూచాల్ పౌరుషాముల్ పలుకాకు పరువులిడుమా ॥

25. జింగ్లా రాగము—త్రిశ్రగతి తాళము.

ప్రమీల—మనమానందమును జెందె నేడునా నా
మది సంతొసము మదికానందము
మది సంతొసము కలిగేను నా ॥మన॥ ॥పల్ల॥

మోహనాంగ నే నిను మదిని నమ్మోర్ నేను మదిని నమ్మోర్ ॥
నన్ను గరుణగాంచుమా ॥మనమా ॥౧॥
రమ్మవేగమె నీవు నాదువిడదికి
వెగనాదువిడదికి రమ్మావేగమే ॥౨॥

26. కల్యాణి / యమన్ } అనుబంధము. రాగము ఏకతాళము.

బభ్రువా—సేమమె జనులూ మంత్రీ మనదేశానా ॥సే॥
సమమెన్నానీ భూరిసుఖాము గనినరవరులూ సేమామూనా
దేశామేనీ చాలా మేలూ గాంచి మించి శుభంబుల
మందురె జెల్పుమనాకు సేమమె ॥౧॥

27. భూప్ రాగము - ఏకతాళము.

బభ్రువా—నిలువా పోరూనా నినుగలతూ నిజము సంగరమూనా
ప్రల్లదములు యిటుపలుకగనగునా బెలిబలె నీకిది తగునా ॥ని॥
కానికాని వినుకని వినుమెరుగను రేపు దినామూనా
బలె నీపొగురార్తును గనుమా ॥ని॥

28. భూప్ రాగము - ఏకతాళము.

బభ్రువా—నిలువా పోరూనా నినుగలతూ నిజము సంగరమూనా
ప్రల్లదములు యిటుపలుకగనగునా బెలిబలె నీకిది తగునా ॥ని॥
కానికాని వినుకని వినుమెరుగను రేపు దినామూనా
బలె నీపొగురార్తును గనుమా ॥ని॥

29. హిందూస్తాని కానడ రాగము - ఆదితాళము.

అర్జున—భయమొందుట తగునే మీరిటులన్
బాలకు డాడిన బహుమాటలకున్ ॥భయ॥పల్ల॥

పరుసోక్తులు నే నాడితి ననుచుఁ
దురంబునకు నై క్రూరుఁప రాగం
వరభుజ బలుడీ వృషకేతువిక
మరునుని బట్టుచు ద్రుంపడె శిరముఁ ॥భయ॥

30. అసావేరి రాగము - ఆదితాళము.

బభ్రువా—ఆసరుగానగ బోయితీ అవమానకీలిబడి
అకటచెడితిని యేమని నేమన జాలునఁనూ
పోటుమాటలని చేటుగ పల్కెను నినువిడనాడె జారిణియనుచూ
సైరణ గనక నరుని గెరితి తారీతి అవమాన కీలబడి ॥అకట॥

31. మాలకంస్ రాగము - ఆదితాళము.

వృషకేతు—పంపుమ తండ్రి బవరమునకు ననువేగా ॥పల్ల॥
పోరున అరిసీ కారియ నిడినే శూరుడ నగుదు ధారణీ నీ ॥పల్ల॥
అగ్గలముగాను వెగ్గాల మడచి అరులగెల్చివత్తు నేను ॥ అనుపల్లవి ॥
అతడు శరధార వేరూల నీవుజూడ మరిముదమందగ సలుపూదును
వేడెదా నిను అనికిపోవ అరాతిరాచి నిరాసు వ్రూల బిరానచేతు కను
మర్యాదయూ వినుమా వేడెదా వేగననుప వేఁడువాడ ॥పల్ల॥

32. { వృషకేతు—కల్యాణి రాగము - తిశ్రగతి తాళము.
బభ్రువా—కల్యాణి రాగము - చాప్ తాళము. }

వృషకేతు—భద్రమునీవు భద్రమునీవు బాలకా పదరకు వదరకూ
పొగురడంతు నిన్ను నే పోరనర్ప నిల్వరా ॥భద్ర॥

బభ్రు—చాలు చాలిక వలదు పలుకకు భూపు మార్గణమం...
పోవుప్రాణము దీనినుండియు బొందుమా శరణంబునన్ ...॥

33. హిందుస్తాని తోడి రాగము - తిశ్రగతి తాళము.

వృషకే—పలువా నానాశరములచే నీ పొగురడంచెదను కనుగొనరా॥
సమరంబున నిన్ గూలగజేసి యముని విడదికిని నంపింతు ॥

బభ్రు—చాలూ చాలూ

వృష—పోరా క్రూరా

బభ్రు—పోరూన నిల్వర పొందుగ నీదగు శౌర్యమినార్చెద నీవుగన

వృష—పలువా నానా శరములచే నీ పొగురడంచెదను కనుగొనరా
వలదూ పొగురూ పలుకుల్ తగదూ॥

బభ్రు—కాసర యీకాండము నీకాయమునన్
కాల్చూనురా నిను జీల్చునురా ॥

34. ఇంగ్లీషు నోటు— శంకరా భరణ రాగము - తిశ్రగతి తాళము.

బభ్రు—పోరనీదు విరిచి పలుకులకునె వెరవనూ
దురామూనా నీ శిరము దుగ్గింతు మదిని నమ్ముమూ ॥పో॥

అర్జున—బాలక ప్రాణము బాయకుమూ
నీ చేరుమ నీదు పురివేగ

బభ్రు—చాలు చాలు నీ పౌరుషముల్ నీ
చేర్చెద చూడుమ యమపురి నిన్

అర్జున—ప్రల్లదంపు పలుకులు సహింప నోపకైనునూ

బభ్రు—పోరనీదు పిరికి పలుకులకు నే వెరవనూ

దురామూనా నీ శిరము ద్రుంతు మదిని నమ్ముమా ।।

35. హిందుస్తాని తోడి రాగము - ఆది తాళము.

బభ్రు—జననీరో కోరెదా నీదయనూ వే ।।జ।।పల్లి।।

జననీరో కోరెదా జననిరో వేడెదా ।।జ।।౧।।

మానసంబున నిను మరువను మాతా

మానక నే సదా నినుదలతుౝ ।।౨।।

36. పీలు రాగము - ఆదితాళము.

బభ్రు—నరహరి మాధవ పరిమదయాళో

నిరతము నినుమది శరణని వేడెదా ।।న।। పల్లి।।

పరమ దయాకర పావననామా

కరివరదా ననూ గాంచుమ ప్రీతిని ।।న।।౧।।

కావుమ శ్రీహరి కలతలడంచీ

కానను దారినె గతిసేవే శ్రీకృష్ణా ।।౨।।

37. ఖాంబ్ రాగము - చాప్ తాళము.

చిత్రాంగద:—హా దైవామే గతినాకు పతిబాసెను నన్నూ

పతిబాసెను నన్నూ బాసిపోయెనే ।।హా।।

బవరము నేలాబడితివో నాథా బాలునిచే నీహామా

పాపి బ్రతుకిలనా నేమనుదు నేటులా।।

## 38. అనుబంధము.

మర్కుద్ధి దుస్స్వభావులు:— { చిక్కెను చిక్కెను శిరముయీాడ
{ దక్కెను దక్కెను మాట జాడ
{ నిక్కెనవీనిసట్టడవికాడ
{ గ్రుక్కుచు నుందము యింటినీడ॥

## 39. పీలు రాగము - రూపక తాళము.

బ్రభు:---మాధవా శ్రీధవా భూధవా
కావరా వాసవా జనార్ధన వాసవా జనార్ధనా। పల్ల॥
జనకుని జంపితివి పావీనైతి మనజాలనీక
నీభువి మాధవా వాసవా జనార్ధన వాసవా ॥౧॥

## 40. ఝుంఝూటి రాగము - రూపక తాళము.

### మంగళము.

శ్రీవరా మురాసురహరా కరుణాభరణా
నిజభక్తభరణ చారు తరుణ శోకహరణ॥శ్రీ॥
నీకోమల పదసారస భక్తిదానమునీ నీ
కైవల్యపద సౌఖ్యము ప్రకటముగనీ
నాకునొసంగుము కరుణ జొచ్చితిశరణు నాకీ
వినుతా కరిసౌఖ్యకృతా సూవితతాదీనసహితా వేదనుతా ॥శ్రీ॥



జయశంకర అండ క — విశాఖపట్టణము.

ఆర్యులారా,

జయశంకర్ అండు కంపెనీని నా మామగారైన ఉప్పల కీ॥ శే॥ వీరన్న శ్రేష్ఠిగారు 1906వ సంవత్సరమునుండి 1940వ సంవత్సరం వరకు మదరానులో నడిపించిరి. అటుపిమ్మట నా భర్తగారగు ఉప్పల కీ॥ శే॥ ఎతిరాజుగుప్తగారు బెజవాడలో యింతవరకు జరిపి యిటీవల కాలము చేసి నందున పరిస్తితుల ననుసరించి జయశంకర్ అండ్ కంపెనీని యీ క్రింది చిరునామాకు మార్చబడినది ఈకంపెనీలో సరసమైన వెలలకు దొరకు అమూల్యమైన ఎన్నో గ్రంథములను యీక్రింద చెప్పబడినవి యు యింకాయితరములైన ఉపయోగకరమైన పుస్తకములు అనేకము లు గలవు దయచేసి కోరువారు యీక్రింది చిరునామావద్ద తెలుసు కొనవచ్చును.

**పురాణములు :—** ఆగ్నేయపురాణము, కల్కిపురాణము, బాలరామాయణములు, మత్స్యపురాణము, యింకా ఇతరములు.

**వైదిక గ్రంధములు—:** ఆబ్ధిక మంత్రములు, 360 వ్రతములు, ఋగ్వేద సంధ్యావందనములు, నిత్యకర్మాష్టకము, యాజుష ప్రయోగ చింతామణి, రుద్రనమకచమకము, సూర్యనమస్కారము యి॥.

**ధర్మశాస్త్రములు:—** నిర్ణయసింధు, త్రివర్గప్రదీపిక, శాంతికమలాకరము ఇంకా ఇతరములు.

**స్తోత్రములు:—** కృష్ణలీలాతరంగిణి, కృష్ణకర్ణామృతము, దేవీస్తోత్రకదంబము, తిరువాయిమొళి, ధ్యానామృతము, నీతి శాస్త్రము, ముముక్షుపడి, రామ కర్ణామృతము ఇంకా యితరములు.

**సహస్రనామములు:—** అష్టోత్తర శతసహస్రనామ కదంబము, అన్నపూర్ణ, ఆంజనేయ, రామ, లక్ష్మి, లలితా వగైరా.

**దండకములు:-** దండకత్రయము, రామ, కృష్ణ, శివ వ॥

**నక్షత్రమాలికలు:—** నైషద నక్షత్రమాలిక, జ్ఞాన ప్రసూనాంబ వగైరా.

చిరునామా:— ఉప్పల లక్ష్మీకాంతమ్మ. బుక్ సెల్లర్ అండు పబ్లిషర్.
జయశంకర్ అండు కంపెని; 13/79. బొడ్డురామయ్యగారి సందు;
బురుపేట, విశాఖపట్టణము.

మంత్రతంత్రములు:— మంత్రరత్నాకరములు, మ...
శమంత్రములు, సమ్మోహన శాస్త్రము, సకలమంత్రోపాసనక్రమము వగైరా.

వేదాంతములు:— సీతారామాంజనేయ సంవాదము, శు...
వేదాంత తమోభాస్కరము, బ్రహ్మవిద్య, కైవల్యనవనీతము, భగవ...
ముముక్షుజనకల్పము, భంవాసేన్ దాసు తత్వములు, వేమనపద్యములు, శివ...
సుజ్ఞానరత్నావళి వగైరా.

ఉపనిషత్తులు:— కొలది రకములు.

సంస్కృతకావ్యములు, నాటకములు:— నీతిశాస్త్ర...
ములు, భర్తృహరి సుభాషితము, రఘువంశము ఇంకా ఇతరములు.

వ్యాకరణము, అలంకారము:— శబ్దమంజరి వగైరా.

నిఘంటువులు, అమరము:— ఆంధ్రనామ సంగ్రహము...
ఆంధ్రపదపారిజాతము, గురుబాలప్రభోధిక వగైరా.

ఆంధ్రగ్రంధములు:— అపూర్వ సంఘుసంస్కరణము, భా...
తము, భాగవతము, రామాయణము, గుప్తభావప్రదీపిక, చాటుపద్య మణిమం...
జరి, శృంగారకంఠాబరణము, శృంగార రసాలవాలము, శృంగార సావిత్రి ...

శతకములు:— కవిచౌడప్ప శతకము, కన్యకాంబతారావళి, ...
గుణాదర్శనము అను శ్రీ తిరుపతి వెంకటేశ్వర శతకము, పెద్దచ్చు శతకము...
టీకా తాత్పర్య శతకములు వగైరా.

కథలు, వచనములు:— నిజమైన కాశీమజలీ కథలు, కా...
రామేశ్వర యాత్రాదర్పణము, తెనాలిరామలింగని వింత కథలు, నలుగురు ...
ర్ల కథలు, మదనకామరాజు కథలు మొదలగు చాలారకములు గలవు.

నవలలు:— అనురాగవిపాకము, సుశీలామైనావతి, రాజమండ్రి...
బెజవాడ, చెన్నపట్నము వగైరాలు ఎన్నోవందల నవలలు గలవు.

జీవిత చరిత్రములు: — ఆసియాఖండ విజ్ఞాన రహస్యము...
దేశనాయకుల చరిత్రలు వగైరా.

ఆనందమయములు:— పడకటింటి రహస్యాలు, సతీపతి కుతూ...
హల రహస్యములు వగైరా.

---

డ్రామాలు:- బలిజేపల్లి, పానుగంటి, రామనారాయణ, చక్రవిధా ...లు, కోలాచల, చిలకమర్తి, ద్రోణంరాజు, చెన్నపట్నం, కాకినాడ, బెజవాడ, ...జమండ్రి వగైరా ప్రాంతముల ఎన్నోవందల డ్రామాలుకలవు.

కీర్తనలు:- అధ్యాత్మరామాయణము, కబీరుదాసు, భగవన్నామ, ...మదాసు, హరిభజన, హరినామ వగైరా కీర్తనలు.

హరికథలు:- అనసూయ, చంద్రహాస, సావిత్రి, పెద్దదాసు, ...క్మాంగద వగైరాలు.

నాటకములు:- ధర్మాంగద, మైరావణ, సంతవేలూరు, ప్రహ...దలు, వీరభద్ర. రామ నాటకములు వగైరాలు.

పదములు:- కుశలాయకం, గంగావివాహము, వైకుంఠమహత్మ్యం, ...రదరామాయణము మొదలగునవి.

జంగంకథలు:- కాంభోజ, కామమ్మ, బొబ్బిలి, బాలనాగమ్మ, ...మ్మరి గుండయ్య వగైరా.

యక్షగానములు:- కపటవేశ్యా నాటకము, రుక్మాంగద, ...రుడాచలము వగైరా.

పాటలు:- ఊర్మిళా దేవి. తులసిగోవిందము. పడవపాట. మేలుకొ...పులు. విచిత్ర విడికథ సవాలు. లడ్డూ. పకోడీ సంవాదం చెన్నపట్నం. బెజ...డ. రాజమండ్రి. మొదలగునవి.

ద్విపదలు:- బాలభాగవతము. నలచరిత్ర. వగైరాలు.

సంగీతములు:- గాయనగాయనీయ పారిజాతము. సంగీతసర్వార్థ...రసంగ్రహము. గానవిద్యావినోదిని. గట్టుపల్లివారివి మొదలగునవి.

వైద్య గ్రంథములు:- బాహటము. చింతామణి. ప్రసిద్ధఆంగ్ల ...ఔషదయోగములు, వైద్యనిఘంటువులు. శుశృతశారీరస్థానం చెన్నపట్నం. ...జమండ్రి. బెజవాడ తదితర ప్రాంతముల వైద్య గ్రంథములు చాలకలవు.

జ్యోతిష గ్రంథములు:- కాలచక్రం. బృహజ్జాతకం. చెన్నపట్నం. ...జవాడ. రాజమండ్రి. కాకినాడ తదితర ప్రాంతముల వగైరా ఎన్నోకలవు.

...అక్షులు, పాకశాస్త్రములు, ఫారుసులు. వర్తక మర్మములు మొదలగునవి.

---

చిరునామా:— ఉప్పల లక్ష్మీకాంతమ్మ. బుక్ సెల్లర్ అండు పబ్లిషర్.
జయశంకర్ అండు కంపెని; 13/79. బొడ్డురామయ్యగారి సందు;
బుర్జుపేట. విశాఖపట్నము.

| | |
|---|---|
| బృహజ్జాతకము | 2-0-0 గ్లేజు 3-0-0 |
| కాలచక్రము | 1-0-0 గ్లేజు 1-8-0 |
| జ్ఞానప్రదీపిక అను మళయాళ ప్రశ్నలు | వెల 5-0-0 |
| తిలకఫల విజ్ఞానమను పుట్టుమచ్చల ఫలము | 0-3-0 |
| కేరళపంచపక్షిప్రశ్న శాస్త్రము | 0-8-0 |
| రసయోగ రత్నాకరము | 2-0-0 |
| సుశ్రుత శారీరస్థానము | 2-8-0 |
| సర్పశాస్త్రము | 0-8-0 |
| షర్బత్ పాక రత్నావళి | 0-6-0 |
| సహదేవ పశుచికిత్స | 0-6-0 |
| వైద్య శతశ్లోకి | 0-4-0, 0-6-0 |
| అనుపాన మంజరి | 0-8-0 |
| నాడీనిదానము తాత్పర్యం | 0-4-0 |
| నాడీజ్ఞానము | 0-4-0 |
| బ్రహ్మవిద్య | 0-2-0 |
| శుష్క వేదాంత తమోభాస్కరము | 3-0-0 |
| సీతారామాంజనేయ సంవాదము సంగ శేషాచలశాస్త్రిగారి ఆంధ్రటీకా తాత్పర్య విశేషార్థ సమన్వితము | వెల 3-8-0 గ్లేజు 6-0-0 |
| కైవల్యనవనీతము | 5-8-0 |
| ధ్యానామృతం | 0-6-0 |
| సమ్మోహనశాస్త్రము అందు అదృష్ట తాజము | 1-8-0 |
| అభ్యాసన చక్రము | 0-4-0 |

| | |
|---|---|
| వేదాంత భక్తి కీర్తనలు | 0-1- |
| యాజుషప్రయోగ చింతామణి | 2-0- |
| వ్రతచూడామణి | 2-0- |
| సకల మంత్రోపాసనక్రమము | 0-6- |
| దేవీస్తోత్రకదంబము | 0-8- |
| శివస్తోత్రామృతం | 0-4- |
| కవిచౌడప్ప శతకం | 0-2- |
| కల్కిపురాణము | 0-12-0, 1-4- |
| తెనాలిరామలింగని కథలు | 0-4- |
| రంగదాసు భజన కీర్తనలు | 0-4- |
| సుశీల మైనావతి | 0-8- |
| మరకతవల్లి | 0-10- |
| శమంతసేన | 0-4- |
| దొరికితివిరా దొంగ | 0-6- |
| నేనే దొంగను | 0-8- |
| విషాద వాసంతిక | 0-6- |
| వలపుల మడుగు | 0-4- |
| శకుంతల జనన నాటకం | 0-8- |
| వైకుంఠ మహాత్మ్యం | 0-8- |
| ఉషాకళ్యాణం బాణాసురయుద్ధం | 0-12- |
| కపటవేశ్యా నాటకం | 0-10- |
| మైరావణ నాటకం | 0-8- |
| ధర్మాంగద నాటకం (పాలుట్ల) | 0-6- |
| ఉషా నాటకం (తిరునగరు) | 0-4- |
| వీరభద్ర నాటకం త్వరకవి | 0-10- |
| పడకటింటి రహస్యాలు | 1-0- |

ఇంకా అనేక రకములు గలవు.

 కాలమానపరిస్థితుల ననుసరించి ధరలు మారుచుండును.

చిరునామా:— ఉప్పల లక్ష్మీకాంతమ్మ, బుక్ సెల్లర్ అండు పబ్లిషర్.
జయశంకర్ అండు కంపెని; 13/79, బొడ్డు రామయ్యగారి సందు;
బుర్జుపేట, విశాఖపట్నము.



నవీన ప్రింటరు, విశాఖపట్నం. 9-11-5